శ్రీరస్తు

దత్తాత్రేయాయ నమః

# కామేశ్వర వాస్తు సుధాకరము




గ్రంథకర్త

కవిరాజ్ వాస్తు పండిత, వైద్యకళా విభూషణ

**శ్రీ అరసవల్లి కామాచార్య**

మచిలీపట్టణము



ప్రకాశకులు

**బాలాజి బుక్ డిపో,**

పబ్లిషర్స్ & బుక్ సెల్లర్స్,

మెయిన్‌బజార్, విజయవాడ - 1

కామేశ్వర వాస్తు సుధాకరము

గ్రంథకర్త : **శ్రీ అరసవల్లి కామాచార్య**

పంచమ ముద్రణ : జనవరి 2003

మూల్యము : **రూ. 99-00**

కాపీరైట్ రిజిష్టర్డు

ముద్రణ :
**నిర్మల ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
గాంధీనగర్, విజయవాడ

## ముఖ్య ప్రకటన

కవిరాజ్ - వాస్తు పండిత, వైద్య కళా విభూషణ అరసవల్లి కామాచార్య విరచితమగు "కామేశ్వర వాస్తు సుధాకరం" అను గ్రంథమునకు సంబంధించిన కాపీరైట్ వగైరా సర్వహక్కులను వారి కుమారులగు శ్రీ బాబుగారి వద్ద నుండి నేను పొందియున్నాను.

కనుక ఈ గ్రంథమునకు సంబంధించిన సర్వహక్కులు నాకు చెందివున్నవి గనుక యిందలి యే అంశమును తెలుగున గాని, మరియే యితర భాషల యందైన గాని, ఎవ్విధమగు మారు రూపమున గాని మా వ్రాత మూలకమైన అనుమతి లేక ఎవరేనియు ప్రచురించేయెడల మేము జరుపగల సివిల్, క్రిమినల్ చర్యలకు బాధ్యులు కాగలరని యిందుమూలముగా హెచ్చరించడమైనది.

ఇట్లు
ప్రకాశకులు
**ధూళిపాళ్ళ రూపవాణి**
బాలాజి బుక్ డిపో,
మెయిన్ బజార్,
విజయవాడ - 520 001.

# సృష్టికర్త




దైవజ్ఞ

దత్తాత్రేయాయ నమోస్తుతే

జగదుత్పత్తి కార్యై చ స్థితి సంహార హేతవే ।

భవ పాశాది ముక్తాయ దత్తాత్రేయ నమోస్తుతే ॥

# తొలిపలుకు

ధనుర్వేదము, ఆయుర్వేదము, గాంధర్వవేదము, అర్థవేదము మొదలైన ఉపవేదములో వాస్తుశాస్త్రము అర్థవేదములోని ఒక శాఖయై యున్నది. దీనినిబట్టి వాస్తుశాస్త్రము యొక్క ప్రాచీనత వ్యక్తమగుచున్నది. విశ్వకర్మ, మయుడు మొదలగు అనేకమంది మహానుభావులు ఈ శాస్త్రమును రచించియున్నారు.

నగరములు, కోటలు, అంతఃపురములు, వసతి గృహములు, పశుశాలలు, ధాన్యాగారములు, యంత్రశాలలు, వైద్య, విద్య, నాట్యశాలలు, దేవాలయములు మొదలగునవి నిర్మించు స్థలములను, తావులను, విధములను ఈ శాస్త్రము వివరించును. జప తపోస్థలములకు, యుద్ధ భూములకు, వ్యవసాయ క్షేత్రములకు కూడా ఈ శాస్త్రము వర్తించును.

పూర్వము క్షేత్రపరీక్షచేసి వాస్తుశాస్త్రరీత్యా గృహాది నిర్మాణములు చేసినట్లు త్రవ్వకాలవల్ల బయల్పడ్డ "మొహంజదారో", "హరప్పా" పట్టణాలే అందుకు ప్రబల తార్కాణములు.

జ్యోతిష్యశాస్త్రము మానవ "యోగమును" విశదపరచును.

వాస్తుశాస్త్ర ప్రకారము గృహాది నిర్మాణములు చేసి వసించువారికి మంచి "యోగము" సిద్ధించును.

నేటి సాంఘిక వ్యవస్థలో ఆరోగ్యశాఖవారు, టౌన్ ప్లానింగ్ శాఖవారు వాస్తు శాస్త్రము ననుసరించి తమ తమ విధులను నిర్వర్తించవలసిన అగత్యమెంతయినా యున్నది.

రాష్ట్ర, రాష్ట్రేతరాలలో అనేక గృహాది నిర్మాణములను వాస్తుశాస్త్రరీత్యా పరిశీలించి గడించిన నా నలుబడి సంవత్సరముల అనుభవమును పురస్కరించుకొని పూర్వ గ్రంథములలోని శ్లోకములను ఉల్లేఖించి ఈ గ్రంథమును వ్రాసితిని.

వాస్తుశాస్త్రమునందు క్షేత్రనిర్ణయము మిక్కిలి ప్రాధాన్యమని నా అనుభవము ననుసరించి అభిప్రాయపడుచున్నాను. అందుచేతనే క్షేత్రమును దానియొక్క ఉచ్ఛ, నీచములనుబట్టి ధనవర్గ, ఋణవర్గ, పురుషవర్గ, కన్యవర్గలుగా ఈ గ్రంథమునందు వివరించితిని.

ఈ వాస్తుశాస్త్రమును సహృదయులంతా ఆదరించెదరని ఆశిస్తున్నాను.

ఇట్లు

<u>గ్రంథకర్త</u>

# విషయసూచిక


| | | |
|---|---|---|
| మొదటి అధ్యాయము | ... | భూపరీక్షా ఖండము |
| రెండవ అధ్యాయము | .... | క్షేత్ర పటములు |
| మూడవ అధ్యాయము | .... | క్షేత్ర అర్వణ ఖండము |
| నాలుగవ అధ్యాయము | .... | గృహ అర్వణ ఖండము |
| ఐదవ అధ్యాయము | .... | దిశార్వణ ఖండము |
| ఆరవ అధ్యాయము | .... | ద్వార ఖండము |
| ఏడవ అధ్యాయము | .... | వాపి, కూప, తటాకాదులు |
| ఎనిమిదవ అధ్యాయము | .... | ముహూర్త ఖండము |
| తొమ్మిదవ అధ్యాయము | .... | అనుభవ ముహూర్తాంశములు |
| పదవ అధ్యాయము | .... | గృహగణిత క్రమ ఖండము |
| పదకొండవ అధ్యాయము | .... | పూర్ణాంక గృహ గణిత పదములు |
| పదిరెండవ అధ్యాయము | .... | గృహ గర్భ గణిత పదములు |
| పదమూడవ అధ్యాయము | .... | భిన్నాంక గృహ గణిత పదములు |
| పదునాలుగవ అధ్యాయము | .... | దిశ గల గృహ పటములు |
| పదునైదవ అధ్యాయము | .... | విదిశ  గల గృహ పటములు |

# మొదటి అధ్యాయము



## భూ పరీక్షా ఖండము

శ్లో॥ *భూ పరీక్షా ప్రయత్నేన వాస్తు కర్మ సమాచరేత్।*

*భూ పరీక్షా విధానేన సర్వం నిష్ఫల మాదిచేత్॥*

సర్వ ప్రయత్నముల చేతను ముందుగా భూమిని పరీక్షింపవలయును. తతః వాస్తు కర్మ నాచరించవలయును. ముందుగా భూమి యొక్క గుణములు పరీక్ష చేయక, గృహకర్మ ప్రారంభము చేసిరేని సర్వము శూన్యము, వ్యర్థము అగును.

శ్లో॥ *నిర్మాణే పత్తనే గ్రామ క్షేత్రాదీనాం సమం తతః।*

*క్షేత్ర మాదౌ పరీక్షేత గంధ వర్ణ రసప్లవైః॥*

పట్టణములు, గ్రామములు, పల్లెలు, అగ్రహారములు నిర్మాణము చేయునప్పుడు మొట్టమొదట క్షేత్రము యొక్క ఆకారములు, నీళ్ళు పోవు మార్గములు, భూముల యొక్క రంగు, వాసన మొదలగు విషయములు అన్నీ బాగుగా పరీక్షచేసి, తరువాత గృహ నిర్మాణమునకు ప్రారంభము చేయవలయును. కాని, భూమిని పరీక్ష చేయకను, భూమియొక్క వర్ణాల నిరూపణ చేయకను, వాస్తు కర్మతో గృహనిర్మాణములు ఆచరించిరేని అంతయు నిష్ఫలమేగాక, అనర్థకములు కలుగును. ఈ విషయములు పాఠకులకు విశదమేగాక జాగ్రత్తగాను, సూక్ష్మముగాను పరీక్షచేసి, వర్ణాల నిరూపణ చేసి గృహారామ నిర్మాణములు చేసుకొనవలెను

## మృత్ఫలము

శ్లో॥ *ఉత్తమం మధురం జ్ఞేయం మధ్యమంతు కషాయకమ్।*

*అధమ అమ్లరుచికం తిక్తం చాధమాధమమ్॥*

అనుటచేత, భూమిని మూరలోతు త్రవ్వి, ఆ లోపలిభాగపు మన్నును నాలుకమీద వేసుకొనగా తియ్యని రుచి ఉత్తమము. మిశ్రమమైనది మధ్యమము, పుల్లని రుచి అధమము, చేదు రుచి అధమాధమము అని తెలుసుకొనవలయును.

## మృత్తికాఘ్రాణ ఫలము

శ్లో॥ *ఉత్తమం పద్మగంధంచ మధ్యమం వాజిగంధకమ్।*

*అధమం పశుధాన్యాదీన్ ఇతరం పరివర్జయేత్॥*

త్రవ్విన మన్నును వాసన చూడగా తామరపద్మవాసన ఉత్తమము గుఱ్ఱపు మదపువాసన మధ్యమము, పశు ధాన్యాది వాసన అధమము, ఇతర వాసనలు అధమాధమములు.

## భూమి వర్ణ ఫలము

శ్లో॥ *ఉత్తమం శ్వేతవర్ణంచ మధ్యమం లోహితం తథా।*

*అధమం పీతవర్ణంచ కృష్ణవర్ణాధమాధమమ్॥*

తెల్లని రంగు గల భూమి శ్రేష్టమనియు, ఎఱ్ఱని భూమి మధ్యమ మనియు, పచ్చని రంగు గలది అధమమనియు, నల్లని రంగుగల భూమి అధమాధమమనియు తెలుసుకొనవలయును.

మరియు బ్రాహ్మణాది చాతుర్వర్ణముల వారికి; ఆయా భూములు ఆయా వర్ణముల వారికి ఉండవలయునని కొందరి మతము

శ్లో॥ *శ్వేత రక్త తథా పీతా కృష్ణవర్ణాను పూర్వతః*

తెల్లని భూమి బ్రాహ్మణులకనియు, ఎఱ్ఱని భూమి క్షత్రియులకనియు, పచ్చని భూమి వైశ్యుల కనియు, నల్లని భూమి శూద్రులకనియు చెప్పబడెను కాని, వర్ణాశ్రమ ధర్మములు వృత్తులను బట్టి ఏర్పడినవి దైవ సృష్టిలో స్త్రీ పురుష జాతులు రెండు మాత్రమే ఉన్నవి. సుజ్ఞానము చేత బ్రహ్మత్వము, అజ్ఞానము చేత శూద్రత్వము ఏర్పడినవి వృత్తులచేత కులము లేర్పడినవి కావున, వృత్తికి తగిన గృహనిర్మాణములు చేయుట ఉత్తమము. ప్రతి మానవుడూ ఉత్తమమైన క్షేత్రమును సాధించి గృహ నిర్మాణము చేసికొనిన యెడల సకల శ్రేయస్సులు, సిరిసంపదలు కలుగుననుటకు సందేహము లేదు.

## భూమి ఆకార ఫలములు

శ్లో॥ ఆయతం సిద్ధయస్సర్వా....॥

తూర్పు, పశ్చిమము పొడవుగల భూమి సకల సంపదలు కలుగజేయును



ఆయతము

శ్లో॥ ....శ్చతురస్రే ధనాగమః॥

నాలుగువైపుల సమానము గల భూమి ధనవృద్ధి, సర్వకార్య జయము కలుగజేయును.



చతురస్రము

శ్లో॥ వృత్తేతు బుద్ధి వృద్ధిస్యా....॥

వృత్తాకారము అనగా గుండ్రముగా వున్న భూమి బుద్ధి విశేషతను కలుగజేయును.



వృత్తాకారము

శ్లో ॥ ....ద్భద్రం భద్రాసనం భవేత్॥

భద్ర పీఠాకారము గల భూమి శుభము, సౌఖ్యములు కలుగజేయును.



భద్రపీఠాకారము



చక్రాకారము

శ్లో॥ *చక్రే దారిద్ర్య మిత్యాహు.....॥*

చక్రాకారము గల భూమి దారిద్ర్యము కలుగజేయును.



విషమకోణము

శ్లో॥ *....ర్విషమే శోక లక్షణమ్॥*

విషమ కోణము అనగా కొనలుగల భూమి నిరంతరం దుఃఖమును కలుగజేయును.



త్రికోణము

శ్లో॥ *రాజభీతి త్రికోణేస్యా...॥*

మూడు కోణములు గల భూమి, రాజ్యకారణ ముల వల్ల నష్టములు కలుగజేయును.



బండి ఆకారము

శ్లో॥ *.... చ్ఛకటేతు ధనక్షయమ్॥*

బండి యాకారము గల భూమి ధన నాశనము కలుగజేయును.

శ్లో॥ దండే పశుక్షయం ప్రాహుః....॥

దండాకారము అనగా- కర్ర వలె ఆకారము గల భూమి. అది పశువులను నశింపజేయును.



దండాకారము



శ్లో॥ *.... శూర్పవాతే గవాక్షయః ॥*

*చాట వలె యాకారము గల భూమి గోవులను నశింపజేయును.*

చాటాకారము

శ్లో॥ *కూర్మేతు బంధనం పీడా....॥*

తాబేలువలె ఆకారం గల భూమి బంధనం అనగా కారా గారవాసం కలుగజేయును.



తాబేలాకారము

శ్లో॥.... *ధనుక్షేత్రే భయం మహత్॥*

ధనురాకారముగల భూమి శత్రువుల వల్ల భయమును కలుగజేయును.



ధనురాకారము

శ్లో॥ కుంభాకారే కుష్టురోగో
భవత్యేవ న సంశయః॥


కుండాకారము

కుండ యాకారముగల భూమి కుష్టు మొదలగు విపరీత వ్యాధులు కలుగజేయును

పైన ఉదహరించిన ఆకారములుగల భూములలో భవన, గృహాది నిర్మాణముల వల్ల ఆయా ఫలములు సిద్ధించుటలో సందేహము లేదు

## అధిక విశాల భూ లక్షణములు

శ్లో॥ బ్రాహ్మణా భూ కుశోపేతా క్షత్రియస్యాచ్ఛరాకులా।
కుశాకాశాకులా వైశ్య శూద్రా సర్వ తృణాకులా॥

శ్లో॥ బ్రాహ్మణాస్సర్వసుఖదా క్షత్రియా రాజ్యదా భవేత్।
ధనధాన్యకరీ వైశ్యా శూద్రాతు నిందితా బుధైః॥

దర్భయుక్తమగు తెల్లని భూమి బ్రహ్మజాతి యగును. ఇది సర్వ సుఖముల నిచ్చును. కాకి వెదురు, రక్తవర్ణము గల భూమి క్షత్రియజాతి యగును. అది వాహన, రాజ సౌఖ్యములు కలుగజేయును. కాశిగడ్డి పచ్చని రంగు గల భూమి వైశ్యజాతి యగును. ఈ భూమి అభ్రకము, సుద్ద మొదలైనవి వుండి విశేష ధనధాన్య సౌఖ్యము కలుగజేయును.

సాధారణ గడ్డి, నల్లనిరంగు గల భూమి శూద్రజాతి యగును ఇది సామాన్య మైనది. ఇది కష్టములు, సుఖములు కలుగజేయును. ఇది సేద్య వృత్తిని చేయించును

## శైవ భూ లక్షణములు

శ్లో॥ కర్ణి కారార్జునాశ్వత్థ కపిత్థాశోక ధాతకీ ।
స్థలారవింద తులసీ దూర్వాభిర్వ్యాతతామహీ॥
విష్ణుక్రాంతాంబుకర్ణాభ్యాం శాల్మలీ గిరిశారిభా।
కపోత శుక హంసైశ్చ శైవీ సా శుభదా మహీ॥

కొండగోగు, మద్ది, రావి, వెలగ, అశోక, ఆరె, నేలదామర, తులసి, గరికె, విష్ణుక్రాంత, ఎలుక చెవి, బూరుగ, సుగంధి, పావురము, చిలుకలు, హంసలు మొదలగు వాట్లతో కూడిన భూమి శైవ భూమి యనబడును ఈ భూమికి తూర్పు దిశలోను, ఉత్తర దిశలోను నదీ నదములు, వాపీ తటాకములు వుండవచ్చును దక్షిణ, పశ్చిమముల యందు వుండరాదు ఈ లక్షణములు గల భూములలో శివాలయాదులు, భక్తమందిరములు, విశేష గృహ నిర్మాణాదులు చేసి, నివాసము చేసిరేని దైవభక్తి, దేశ భక్తి, ప్రభు భక్తి కలిగి ఆరోగ్యవంతముగాను, ఐశ్వర్యవంతముగాను, సుఖదాయ కముగాను చేయును ఈ భూమిలో పనికిమాలిన వృక్షములను తీసివేయవలయును ఈ భూమిలో వీధులు తీర్చునప్పుడు నేను ఉదహరించినట్లుగా ఉచ్చ-నీచలు కనిపెట్టి, ధనవర్గులుగా తీర్చుకొని, గృహ నిర్మాణము చేయవలయును

## వైష్ణవ భూ లక్షణము

శ్లో॥ *తిందుకై స్తింత్రిణీభిశ్చ కరజై ర్వేణుభిస్తథా।*
*కార్పాసార్క జపాభిశ్చ హంసైః పక్షిమృగై స్సదా॥*
*నిష్కంటకైస్తథావృక్షై ర్యాభూమిస్సహితా భవేత్।*
*వైష్ణవీ భూ సమాఖ్యాత శౌర్య వీర్యప్రదా నృణామ్॥*

చింత, తూబర, గానుగ, వెదురు, పత్తి, జిల్లేడు, దాసాని, ముల్లు లేని వృక్షములు, హంసలు, మృగములు మొదలగు వాట్లతో కూడిన భూములు వైష్ణవ భూములు అగును. ఈ భూములలో గృహ నిర్మాణములు చేసే నివసించే ప్రజలు శౌర్య, వీర్య, బలపరాక్రమ, పౌరుషవంతులై వుందురు ఈ భూములలో విష్ణ్వాలయములు, రామభజన మందిరములు కట్టవచ్చును ఈ భూమికి ఉత్తరమున నదీ నదములు, వాపీ తటాకములు వుండవలెను

## బ్రహ్మ భూ లక్షణము

శ్లో॥ *బిల్వైఃపలా శైర్దర్భైశ్చ కుశైశ్చ హరిణైస్తథా।*
*హోమద్రవ్యై స్సుగంధైశ్చ భూ బ్రహ్మీ శుభదామతా॥*

మారేడు, మోదుగ, దర్భలు, కుశములు, హోమమునకు పనికివచ్చు కాకములు, జింకలు మొదలగు జంతువులు గల భూములు మంగళకరమైనవి. ఇందు బ్రహ్మాలయములు కట్టవచ్చును.

## ఐంద్ర భూ లక్షణము

శ్లో॥ *కదలీ పనసామ్రైశ్చ పున్నాగైర్వకుళైస్తథా।*
*పాటలైస్సింధు వారైశ్చ తథాచామలకైః పునః।*
*ఇందీవరైశ్చ వైశ్యశ్చ శూద్రై రైందీ మహీమతః।*
*పాటల్యాగరు గంధాఢ్యా ధన ధాన్య సమృద్ధిదా॥*

అరటి, పనస, మామిడి, పొన్న, పొగడ, పాదిరి, దావిలి, నెల్లి, నల్లకలువ మొదలగు చెట్లతోను, పాదిరి, అగరు వీని వాసన గల భూములు శూద్రులకు, వైశ్యులకు ధన ధాన్య సౌఖ్యములు కలుగజేయును.

## ఔక్ష భూ లక్షణము

శ్లో॥ *అంకోలై శ్చ తథా వృక్షైః మార్జాలైర్నకులైస్తథా।*
*శశిగోధా చకోరైశ్చ వృక్షైతాక్ష మహీమతా।*
*శౌర్యవీర్యకరీసా స్యాత్పుజా సంపత్సమృద్ధిదా॥*

ఊడుగచెట్లు, పిల్లులు, ముంగీసలు, కుందేళ్ళు, చక్రవాకములు, తోడేళ్ళు మొదలుగా గల భూమి నక్షత్రభూమి యనబడును. ఈ భూములలో కాపురమునకు తగు గృహ నిర్మాణములు చేసి, నివాసము చేయువారికి శౌర్య, పరాక్రమ, పుత్రసమృద్ధి కలుగజేయును.

## భూత భూ లక్షణము

శ్లో॥ *నిర్గుండీ మాధవీ దూర్వా తక్కోలైః కింశుకై స్తథా।*
*మల్లికా కరవీరైశ్చ మధూకైర్పాతకీ తథా।*
*అన్నదా పుష్టిదా నృణాం భస్మగంధ సమన్వితా॥*

వావిలి, నసంత, మల్లిక, గరిక, ఊడుగ, మోదుగ, తెల్లగన్నేరు, ఇప్ప మొదలగు చెట్లతో కూడినదై, బూడిద వాసన గల భూమి భౌతిక భూమి యగును ఈ భూములలో నివాసము చేయువారలకు అన్న వస్త్రములు. పుష్టిని కలుగజేయును

## ఆసుర భూ లక్షణము

శ్లో॥ *భల్లాతకైర్మహావృక్షై ర్దుష్టసత్త్వైః ఫలాండుభిః।*
*కిరాతకైః కకుభైర్గృధ్రై ర్ధూర్తైస్సర్పైః స్సమన్వితా ।*
*అసురీ యుద్ధ వా భూమిః పూతి గంధ సమన్వితా ॥*

జీడిచెట్లు, క్రూరమృగములు, యెఱ్ఱిగడ్డలు, నేలవేము, యెఱ్ఱిమద్ది, దుష్టులగు బోయలు మొదలగు వాటితోను, దుర్గంధముతో గూడిన భూములు అసురమనబడును. ఈ భూమి యుద్ధములకు, కోళ్ళ మొదలగు పందెములకు, త్రాగుడు మొదలగు పనులకు పనికివచ్చును.

## పైశాచ భూ లక్షణము

శ్లో॥ *శాల్మలీభిస్తథాభూమి ర్వకులైశ్చ విభీతకైః।*
*శ్లేష్మాతకైః ఖరై రుష్ట్రైస్సృగాలై స్సూకరైః పునః॥*
*చండాలైశ్చ పుళిందైశ్చ పూతి గంధోపరాచ సా।*
*పైశాచేతి స్మృతాశా్స్త్రైస్సర్వనాశ సమన్వితా ॥*

బూరుగ, పొగడ, తాండ్ర, ఇరుగుడు చెట్లు గాడిదలు, ఒంటెలు, పందులు, మాదిగలు, బోయలు మొదలగువాటితోను, దుర్వాసన గల చౌడుతోను గల భూములు పిశాచమనబడును. ఈ భూమి నివాసయోగ్యమైనది కాదు. సర్వనాశనము చేయును

## రాక్షస భూ లక్షణము

శ్లో॥ *చండాల విష చోరైశ్చ శిరోరోగాదిభి స్తథా।*
*మరీచ గుడ గంధాఢ్యా రాక్షసీ సా క్షయప్రదా॥*

చండాండ్రు, విషవృక్షములు, దొంగలు సంచరించేది, కారము, తీపి వాసన గలది, తలనొప్పులు కలుగజేయు భూమి రాక్షసులకే ఉపయోగపడును

## వాయవ్య భూ లక్షణము

శ్లో॥ *గోమాయు గణ సంకీర్ణా మల్లికా శర్కరాన్వితా।*
*యా వాయవ్యేతి సా ప్రోక్తా దుఃఖనైర్ధన్య దాయికా ॥*

నక్కలు, కంకరరాళ్ళు గల భూమి వాయవ్య భూమి అగును ఈ భూమి యందు గృహ నిర్మాణాదులు చేసిరేని దరిద్రము కలుగును

## వారుణ భూ లక్షణము

శ్లో॥ *యా పూగై రావృతాభూమి వారుణీ సర్వసిద్ధిదా॥*

పాక వృక్షములు గల భూమి వారుణ భూమి యనబడును ఈ భూమి నివాసయోగ్యము సర్వ సిద్ధులు నొసగును

## ఆగ్నేయ భూ లక్షణము

శ్లో॥ స్నుహిశ్లేష్మాతకాద్యైశ్చ సంయుక్తా క్షుద్రశర్కరైః ।
ఊషరా తోయ హీనంచ ఆగ్నేయా సర్వనాశనీ ॥

బొంతజెముడు, ఇరుగుడు మొదలగు వృక్షములతోను, సన్న సన్న ఇసుకరాళ్ళతోను కూడిన భూమి, ఎచ్చట తవ్వినను నీరులేని భూమి, ఆగ్నేయ భూమి అగును. ఇది సర్వనాశనము చేయును.

పై నుదహరించిన భూములలో శైశము, వైష్ణవము, బ్రాహ్మ్యము, ఔక్షము, ఐంద్రము, భౌతికము, వారుణాది సప్తభూములు మానవులు గృహ నిర్మాణాదులు చేసి నివసించుటకు చాలా యోగ్యము, శ్రేష్ఠము, సుఖ సంపదలు కలుగజేయును.

అసుర, పైశాచ, రాక్షస, వాయువ్య, ఆగ్నేయాది పంచ భూములు శ్రేష్ఠమైనవి కావు. ఈ భూములు జాతి చండాలురకు, కర్మ చండాలురకు పనికివచ్చును

శ్లో॥ రజక శ్చర్మకశ్చైవ నటో బురుడ ఏశ్చైచ ।
కైవర్త మ్లేచ్ఛ భిల్లాశ్చ సప్తయితే మూలవాసినః ॥

చాకళ్ళు, గొడారివాళ్ళు, నటకులు, మేదరివాళ్ళు, తురకలు, చెంచులు, పల్లెగాండ్లు మొదలైనవారు ఆగ్నేయాది భూములలో పశ్చిమ, నైఋతి, దక్షిణ, వాయవ్య దిశలలో నివాసము చేయవచ్చును.

## యోగ్యముకాని భూములు

శ్లో॥ క్షీరదృమే విహారేచ దేవాగారాః తథైవచ ।
ఛాయాయాం గృహనిర్మాణం వర్జనీయం ప్రయత్నతః ।
ఊషరే బిలసంస్థానే కోణ దేశే శ్మశానకే ।
సికతాయాం స్విన్నభూమౌ నిందితాయాం తథైవచ ।
ఏతేషు క్షేత్రదేశేషు న కుర్యాన్మందిరం బుధైః ॥

పాలు గల వృక్షములు, ఆరామములు, దేవాలయముల యొక్క నీడ గల స్థలములు, చౌడు భూములు, బిలములు గల ప్రదేశములు అనగా వంతెన మొదటి భాగములు, కోణము గల భూములు, గ్రామమునకు మొదటి ప్రదేశములు అనగా పొలిమేర గల భూములు, మిక్కిలి పుట్టలు గల ప్రదేశములు, శ్మశానములు గల గ్రామములు, భూమధ్యమము, బొడ్డురాయి గల ప్రదేశములు, మిక్కిలి గంద్ర ఇసుక గల ప్రదేశములు, ఎల్లప్పుడు తేమగల ప్రదేశములు, ప్రజలచే నిందితమైన భూములు గృహ నిర్మాణములకు నిందితములు, అనర్థములు కలుగజేయును.

శ్లో॥ నిష్కపాలం నిరుపలం క్రిమి వల్మీక వర్జితం।
సుషిరాస్థి విహీనంతు తనువాలక సంయుతం।
అంగారతుషహీనంతు వృక్షమూల వివర్జితం।
వంకశేషోత్థితంశ్వభ్ర దరిలోష్ట వివర్జితం।
శర్కరాభస్మహీనంతు నరిబ్చైత్యా సమీపనమ్।
దుష్టప్రాణి సమీపస్థం గృహమందిర సంశ్రితమ్।
దేవాలయ సమీపస్థం కంటక ద్రుమసంయుతమ్।
చండాలవాస్తుకంబైన కర్మకారాలయాశ్రితమ్।
శంకరారామ సంయుక్తం తస్యక్షేత్రంతు వర్జితమ్।
అన్యదేవం విధం వాస్తు సర్వదోషకరం భవేత్॥

పుర్రెలు, రాళ్ళు, పురుగులు, పుట్టలు, బొక్కలు, ఎలుకలు, సన్న ఇసుక, పొట్టు, బొగ్గులు, చెట్లవ్రేళ్ళు, బురద, పెంకులు, మొరపరాళ్ళు, బూడిద మొదలుగా గల భూములున్నూ, వరిగడ్డి, రచ్చమానులు, దుష్ట మృగములు, కోట సమీపము, ముండ్లు గల చెట్లు, చండాలురున్న ప్రదేశము, ఇనుము కరిగించి పనులు చేయువారి సమీపము, నాలుగు వీధులు, వీధి శూలలు గల ప్రదేశము (అడ్డ వీధులు ఉన్నను) పనికిరాదు. కేవలము దారిలేని స్థలములు, శివ వనములు మొదలుగా గల ప్రదేశములలో గృహారామ, యంత్ర, నాట్య శాలాదులు నిర్మాణము చేసిరేని తప్పక ధనక్షయము, కులక్షయము, ఆత్మక్షయము కలుగజేయును.

శ్లో॥ స్ఫుటితా మరణం కుర్యా దూషరా ధననాశనీ।
స శల్యా క్లేశదా నిత్యం విషమా శత్రువర్ధనీ॥

పగిలిన భూమి మరణము చేకూర్చును. పాము పుట్టలుగల భూమి ధననాశనము చేయును. శల్యాలుగల భూమి సర్వదా చింతలు కలుగజేయును. విషమభూమి శతృత్వము కలుగజేయును.

## దేవాలయ వీక్షణము

శ్లో॥ దేవాలయాంచ ఛాయాయాం సూర్యవీధి విపశ్యతి।
దేవానాందృష్టిపృష్టస్యాత్ విష్ణుదండ సహస్రకమ్।
రుద్రా సహస్రదండంచ విష్ణుదండ సహస్రకమ్।
శక్తీనాం వామపార్శ్వంచ దృష్టి విస్తార లక్షణమ్॥

దేవాలయ ఛాయ గల స్థలమునకు సూర్యవీధి అడ్డమున్న ఎడల దోషము లేదు. విష్ణు పశ్చాద్దృష్టికిన్నీ, ఈశ్వరుని పురోదృష్టికిన్నీ సహస్ర దండములు దూరము గల ప్రదేశము మంచిది. శక్తికి పార్శ్వ దృష్టి చాలా దూరము ఉండునని యర్థము

## గజపృష్ఠ భూమి లక్షణము

శ్లో॥ *దక్షిణే పశ్చిమే చైవ నైరృతే వాయుకోణకే।*
*ఏభిరుచ్ఛ్రోభవేద్భూమీ గజపృష్ఠో విధీయతే॥*

ఒక భూమికి దక్షిణ, పశ్చిమ, నైరుతి, వాయువ్య దిశలందు ఉచ్చ అనగా మెరక గల ప్రదేశములు ఉండి, తూర్పు, ఈశాన్య, ఉత్తర దిశలలో నీచ అనగా పల్లపు స్థలము, వీధులు, కాలువలు, చెరువులు గల భూమి గజపృష్టభూమి అగును. ఈ భూమి ధనవర్గు, పురుషవర్గు అని పిలువబడును.

తూర్పు వీధి లేక నీచ స్థలము

ఉత్తరము వీధి లేక పల్లము

నెంబరు ఒకటి

ఈ భూమి ధనవర్గు,
పురుషవర్గు అగును.

దక్షిణము

పశ్చిమము

శ్లో॥ *గజపృష్టేభవేద్వాసః సలక్ష్మీ ధనపూరిత।*
*ఆయుర్వృద్ధికరోనిత్యం జాయతే నాత్రసంశయః॥*

పైన ఉదహరించిన భూమియందు గృహ యంత్రాద శాలలు నిర్మించిన ఎడల ఆయుర్వృద్ధి, విశేష సంపత్తులు, వంశవృద్ధి, ఇంద్రపదవి కలుగును. సంశయము లేదు

తూర్పు వీధి లేక నీచస్థలము

ఉత్తరము

నెంబరు రెండు

విశేష పురుషవర్గు

అగును.

దక్షిణము

పశ్చిమము

ఈ రెండవ నెంబరు భూమి విశేష పురుషవర్గు అగును. ధన వర్గులో ఉండును ఈ నెంబరు భూమికి తూర్పున వీధి లేక నీచ స్థలము, తక్కిన మూడు దిశలలో ఉచ్చ గృహములు గల స్థలములు వుండును.

తూర్పు

ఉత్తరము వీధి లేక నీచస్థలము

నెంబరు మూడు

విశేష ధనవర్గు

అగును.

దక్షిణము

పశ్చిమము

ఈ వెనుక పుటలోని మూడవ నెంబరు భూమికి ఉత్తరమున వీధి లేక నీచ స్థలము, తక్కిన మూడు దిశలలో ఉచ్ఛ గృహస్థలములు ఉండును అప్పుడు ఆ భూమి విశేష ధనవర్గయి, పురుషవర్గులో ఉండును. పై నుదహరించిన మూడు రకముల భూములందు నివసించువారు అత్యంత సిరి సంపత్తులతో నిండియుండెదరు

## దైత్యపృష్ఠ భూమి లక్షణము

శ్లో॥ *పూర్వాగ్ని శంభుకోణేషు చోన్నతిశ్చ యధా భవేత్।*
*పశ్చిమేచ యధానీచం దైత్యపృష్ఠో విధీయతే॥*

తూర్పు




ఈ భూమికి పశ్చిమము వీధి లేక నీచస్థలము, తక్కిన మూడు దిశలలో ఉచ్ఛ గృహస్థలములు ఉండుట వలన కన్యవర్గు అగుచున్నది

శ్లో॥ *దైత్యపృష్ఠే భవేద్వాసో లక్ష్మీర్నాయతి మందిరే।*
*ధనపుత్ర పశూనాంచ హానిరేవ నసంశయః॥*

ఇనుట చేతను, వంశము, పశువులు వుండవు దత్తత, ఇల్లరికములు కలుగును ఒకటవ నెంబరు భూములలో గృహాది నిర్మాణము చేయుట అనర్థకములే అగుచున్నవి ఆడపెత్తనము కలుగును అల్లుడు ఇల్లరికము ఉన్నను, స్త్రీల మెజారిటీ మీదనే ఆధారపడి ఉండును కాన, ఈ భూమి గురించి సూక్ష్మముగా విమర్శించవలసి ఉన్నది

శ్లో॥ *పూర్వోత్ర శంభుకోణేషు చోన్నతిశ్చ యథాభవేత్-*
*దక్షిణేచ యథానీచం దైత్యపృష్ఠో విధీయతే॥*

తూర్పు

ఉత్తరము

నెంబరు రెండు

ఋణవర్గు

దక్షిణము రాజవీధి లేక నీచస్థలము

పశ్చిమము

ఈ స్థలము తూర్పు, ఉత్తర, పశ్చిమములు ఉచ్ఛ గృహస్థలము గాన శుద్ధ ఋణవర్గు భూమి యగుచున్నది దక్షిణమున వీధి లేక నీచస్థలము.

శ్లో॥ *దైత్యపృష్ఠో భవేద్వాసో లక్ష్మీర్నాయతి మందిరే,*
*ధనపత్ని పశూనాంచ హానిరేవ నసంశయః॥*

అనుటచేత, ఈ ఋణవర్గులో ఉన్న భూములలో గృహ నిర్మాణములు చేసి కాపురములు చేయువారికి అష్ట ఐశ్వర్యములుపోయి, ఋణములపాలై, భార్య అనారోగ్యముపాలై, ఆస్థులు తనఖాలపాలై అపత్నీకునిగా చేయును; సంశయము లేదు

## కన్య ఋణ వర్గులకు దోష నివృత్తి

ఒకటవ నెంబరు కన్యవర్గును పురుషవర్గుగా చేయుటకు, తూర్పుదిశలో చిన్నసందు తీర్చవలయును ఆ సందు ఆరు అడుగులు వెడల్పు ఉంచవలెను. కాని, ఈ ఒక్క స్థలము మార్చుటకు వీలు ఉండదు. ఇటు ఉత్తరదిశలోను, అటు దక్షిణ దిశలోను ఉన్న స్థలములు గలవారందరూ ఏకీభవించి తీర్చితేనేగాని చిన్న సందు ఏర్పడదు. అందరు కలిసి ఆ స్థలమునకు తూర్పున చిన్న వీధి ఏర్పరచవలెను అప్పుడు ఆ స్థలములు అన్నిటికి తూర్పున ఆరు అడుగుల సందు వుండును ఆ

సందులోకి ఆ స్థలముల నీరు ఈశాన్యముగాను, తూర్పుగాను పోవును అప్పుడు ఆ స్థలములు అన్నియు పురుషవర్గులై అన్ని గృహముల వారు పుత్ర, ధన, ధాన్య సౌఖ్యములు పొందెదరు, సంశయము లేదు ఈ విధంగా ఋణవర్గును ధనవర్గు చేసుకొనవచ్చును దక్షిణమున రాజవీధి ఉన్నప్పుడు ఉత్తరమున అన్ని స్థలములవారును చిన్నసందుగా తీర్చిన బాగుగా యోగించును నీరు యావత్తు ఈశాన్యమున గాని, ఉత్తరమునగాని చిన్న సందులోకి పోవును. అప్పుడు రెండవ నెంబరు ఋణవర్గు ధనవర్గై అష్టైశ్వర్యములు పొందెదరు; సందేహము లేదు.

ఉదాహరణము . ఒకటి



ఒక భూమిని ఉదాహరణ ఒకటిగా తీర్చినపుడు, తూర్పు వరుస భూములు అన్నియు పురుషవర్గు భూములై, పశ్చిమ వరుస భూములన్నియు కన్యవర్గులు అయినవి. తూర్పు వరుస భూములకు, పశ్చిమ వరుస భూములన్నియు కన్యవర్గులు అయినవి తూర్పు వరుస భూములకు, పశ్చిమ వరుస భూములకు మధ్య ఆరు అడుగుల వెడల్పు గల సందు తీర్చిన, రెండు వరుసలకు తూర్పున నీచస్థలము ఏర్పడును. అప్పుడు పశ్చిమమున ఉన్నవన్నియు పురుషవర్గులై ఉదాహరణ రెండు భూములవలె అగును.

ఉదాహరణము · రెండు

ఉదాహరణము మూడు

తూర్పు

ఉత్తరము

దక్షిణము

పశ్చిమము

ఉదాహరణము . నాలుగు

తూర్పు

ఉత్తరము

దక్షిణము

పశ్చిమము

ఒక భూమిని ఉదాహరణ మూడువలె తీర్చినప్పుడు, ఉత్తర వరుస భూములు అన్నియు ధనవర్గులును, దక్షిణ వరుస భూములు అన్నియు ఋణవర్గులును అగును దక్షిణ, ఉత్తర వరుసల మధ్య ఆరు అడుగులు సందు తీర్చిన, రెండు వరుసలు ధనవర్గులై ఉదాహరణ నాలుగు భూములవలె అగును.

శ్లో॥ *పూర్వోత్తర శంభుకోణేషు చోన్నతిశ్చ యధాభవేత్।*

*యామ్యా పశ్చిమ తో నీచం దైత్యాపృష్ఠో విధీయతే॥*

తూర్పు

నెంబరు మూడు

నిర్దిష్టమైన

కన్య, ఋణవర్గు

ఉత్తరము

దక్షిణము రాజవీధి లేక నీచస్థలము

పశ్చిమము రాజవీధి లేక నీచస్థలము

ఈ మూడవ నెంబరు భూమి చాలా నికృష్టమైనదిగా ఉండి నిర్ధన నిర్జన ప్రదేశముగా కొన్నాళ్ళకు మారిపోవుచున్నది

శ్లో॥ *దైత్యపృష్ఠో భవేద్వాసో లక్ష్మీర్నాయతి మందిరే।*

*వంశం ధనం పశూనాంచ హానిరేవ నసంశయః॥*

ఈ భూమికి పశ్చిమము నీచము, దక్షిణము నీచము, తూర్పు, ఈశాన్య, ఉత్తర దిశలు ఉచ్ఛ గృహ స్థానములు అగుటవల్లను కన్యవర్గు ఋణవర్గు అగుచున్నది ఈ భూమిలో గృహ నిర్మాణములు చేసి నివాసము చేయువారికి ధనము, వంశము శూన్యములై కొంత కాలంలో ఆ భూమి నిర్జన ప్రదేశమై, పెంటల దొడ్డిగా మారిపోవును.

ఈ వెనుక పుటలోని నాలుగవ నెంబరు భూమికి దక్షిణమున రాజవీధి, తూర్పున రాజవీధి, పశ్చిమ, ఉత్తర దిశలలో ఉచ్ఛ గృహ స్థలములు, ఈ భూములలో గృహ నిర్మాణములు చేసి కాపురము ఉండేవారికి ధనము ఉండదు. పురుషవర్గు అగును. అనగా పుత్ర సంతతి ఉండును. గృహమునకు తగిన ధనము లోపించి కష్టజీవులగుదురు. సాధ్యమైనంతవరకు దీనినే ఉచ్ఛ నీచములుగా ఏర్పరచుచుండ వలెను. సామాన్యముగా నడచుచుండును.

తూర్పు రాజవీధి లేక నీచస్థలము

ఉత్తరము

**నెంబరు నాలుగు**

ఋణవర్గులో

పురుషవర్గు

దక్షిణము రాజవీధి లేక నీచస్థలము

పశ్చిమము

తూర్పు

ఉత్తరము రాజవీధి లేక నీచస్థలము

**నెంబరు ఐదు**

ధన, కన్యవర్గు

దక్షిణము

పశ్చిమము రాజవీధి లేక నీచస్థలము

ఈ ఐదవ నెంబరు భూమి తూర్పు, దక్షిణములు ఉచ్చ గృహ స్థానములు. పశ్చిమమున రాజవీధి. ఉత్తరమున రాజవీధి యగుట వల్ల కన్యవర్గుతో విశేష ధనవర్గు అగును విశేషముగా ఆడపిల్లలతోనే కాలము గడచును పురుషులు వుందిరేని అర్భకులై, అల్పాయువు కలుగును కావున, పాఠక మహాశయులు సూక్ష్మ పురుషవర్గు. ధనపురుష

వర్గు, ఋణవర్గు, కన్యవర్గు, కన్యఋణవర్గు, ఋణ పురుషవర్గు, కన్య ధనవర్గు మొత్తము ఎనిమిది వర్గులూ బాగుగా గమనించవలయును.

## నాగపృష్ఠ భూమి లక్షణము

మొదటిది

శ్లో॥ పూర్వ పశ్చిమయోర్దీర్ఘో దక్షిణోత్తర ఉచ్ఛ్రుతా।
నాగపృష్ఠం విజానీయా త్కర్తు రుచ్చాటనం భవేత్॥

ఒక భూమి తూర్పు-పశ్చిమములు పొడవు గలిగి, దక్షిణ ఉత్తరములు చాలా మెరక వుండి, మధ్యభాగము చాలా పల్లము గలదైన అది నాగపృష్ఠ భూమి అగును




శ్లో॥ నాగపృష్ఠే యథావాసో మృత్యురేవ నసంశయః।
పత్నీహానిః పుత్రహానిః శత్రువృద్ధిః పదేపదే॥

అనుట వల్ల మృత్యు భయము, భార్యాపుత్రులకు అరిష్టము కలుగుటయేకాక, మాటిమాటికి శత్రు వృద్ధి, కలహములు కలుగుచుండును

రెండవది

శ్లో॥ దక్షిణోత్తరయోర్దీర్ఘో పూర్వ పశ్చిమ ఉచ్ఛ్రుతా।
నాగపృష్ఠం విజానీయా త్కర్తు రుచ్చాటనం భవేత్॥

ఒక భూమి దక్షిణ-ఉత్తరములు పొడవు గలిగి, తూర్పు-పశ్చిమములు ఉచ్ఛ అనగా-చాలా మెరకగల ప్రదేశము గలిగి, మధ్య భాగము చాలా పల్లము గలదిగా ఉన్న భూమి నాగపృష్ఠ భూమి యగును.

తూర్పు చాలా మెరక దిబ్బలు




పశ్చిమము చాలా మెరక దిబ్బలు

శ్లో॥ *నాగపృష్ఠే యధావాసో మృత్యురేవ నసంశయః।*
*పత్నీ హానిః ధనం హానిః శత్రువృద్ధిః పదేపదే॥*

ఇలాంటి భూములలో గృహాది నిర్మాణము జరిగి, నివాసము చేసిరేని అపమృత్యు భయము, కళత్రము, ధనము నశించుట సంభవించును. శత్రు వృద్ధి, కలహము ప్రాప్తించును. చాలా అనర్థకము కలుగును. సంశయము లేదు మధ్య నీచ అనగా- ఒక భూమికి మధ్య కోనేరు వలె చాలా పల్లముగా నుండును నాలుగు వైపుల గట్లు వుండవు. మామూలు నేలగా వుండును మధ్య పల్లము చాలా ఉండును ఆ ప్రదేశములో తూర్పు దిశనో, ఉత్తర దిశనో గృహాది యంత్రశాలలు నిర్మించిన సర్వ సంపదలు నశించిపోవుటయేగాక, చాలా అనర్థకములు ఏర్పడును

ఇందుకు చిన్న తార్కాణము

మచిలీపట్టణములో గ్రామ మధ్య భాగములో చిన్న కోనేరు వుండెడిది దీనిని పూర్వము ఇంగ్లీషు ప్రభుత్వములోని ఒక దొర నిర్మించెను అప్పుడు ఆ కోనేరు చుట్టు, ఒక ప్రక్క తడికలతోను, కర్రలతోను, తాటియాకు గొడుగులతోను కూరగాయల మార్కెట్టు. ఒక ప్రక్క చినిగిపోయిన గోనెగుడ్డలతొ బండ్లు. మరి ఒక వైపున వరిగడ్డి అమ్మకము, మరొకవైపున మేదర తడికలతో బంగారు అమ్మే కొట్లు బహు పేదరికము గాను. నీచముగాను వుండేవి. తరువాత శ్రీయుత కూర్మా వెంకట రెడ్డి నాయుడు గవర్నరు గారు వచ్చేదరని పురపాలక సంఘమువారు ఆ కోనేరును పూడ్చిరి అలా పూడ్చిన రెండు సంవత్సరములలో పురపాలక సంఘమువారు నాలుగు కోణములు

తీర్చి నాలుగు వైపుల రెండు వరుసలలో కొట్లు నిర్మించిరి అప్పుడు ఒక విధమైన అందముతో వ్యాపారములు విరివిగా సాగుచున్నవి పాఠకులు పరీక్ష చేయవచ్చును మధ్య పల్లముండే ప్రదేశము ''మధ్యేనీచం అర్ధహానిః'' అను ప్రమాణము వర్తించుచున్నది. అనగా మధ్య భాగము పల్లము లేక కోనేరు లేక పెద్ద దిగుడు బావి గల గ్రామము లేక చాలా పెద్ద ప్రదేశమునకు ఉండెనేని ధనహాని, లోభము, పేదరికము కలుగును. పాఠకులు ప్రతి విషయము సూక్ష్మముగా విమర్శించెదరుగాక

## కూర్మపృష్ఠ భూమి లక్షణము

శ్లో॥ *మధ్యేతూచ్చం భవేద్యత్ర నీచం చైవ చతుర్దిశమ్।*
*కూర్మపృష్ఠం భవేద్భూమౌ తత్రవాసో విధీయతే॥*

ఒక విశాలమైన భూమికి నాలుగువైపుల దక్షిణ-పశ్చిమ-ఉత్తర-తూర్పు దిశలలో రాజవీధులు వున్నను లేక నాలుగువైపుల కందకము అనగా- చాలా లోతు వెడల్పు గల నీళ్ళు పారుదలతో కాలువలున్న భూమి కూర్మపృష్ట మనబడును దీనిలో రాజాధిరాజులు, జమీందారులు కాపురములు వుండేవారు.

శ్లో॥ *కూర్మపృష్ఠం భవేద్వాసో నిత్యోత్సాహ సుఖప్రదమ్।*
*ధనధాన్యం భవేత్తస్య నిశ్చితం విపులం ధనమ్॥*

పూర్వము ఈ కూర్మపృష్ఠ భూములలో కోటలు కట్టి కాపురములు వుండేవారు. ఈ కోటలోనే రాజాధిరాజులు, జమీందారులు, దివానులు- దాసీ దాసాదులతో వుండే వారు. వారికి రథ, గజ, అశ్వ ఆందోళికాది వాహన సౌఖ్యములు కలిగి, నిత్య సంతోషముతో విశేష, దన, ధాన్య సంపత్తులతో అఖండ ఐశ్వర్యములు అను భవించేవారు.

ఇటువంటి ప్రదేశములలో ధాన్యము మిల్లులు, కాటన్ మిల్లులు, ఐరన్ వర్క్ షాపులు మొదలగు పెద్ద పెద్ద యంత్రశాలలు నిర్మించిన విశేష ధనలాభము, వందల కొలది జనులకు జీవనాధారములు చేకూర్చును.

నాలుగు దిశలలో కందకములు లేక రాజవీధులు తీర్చిన స్థలమును కూర్మాకారము అందురు. ఈ స్థలములలో పెద్ద యంత్రశాలలు. విశ్వ విద్యాలయములు నిర్మించిన చాలా ఫలవంతముగాను, కీర్తివంతముగాను అభివృద్ధి కలుగును ఈ విశేషత గల భూములలో కొంత కాలమునకు ప్రకృతి మార్పు వల్ల కొన్ని దోషములు కలుగును. అందులకే కోటలు నశించుటకు కారణము. కోట పశ్చిమ కందకము- దక్షిణ కందకము లోతై తూర్పు కందకము- ఉత్తర కందకము లోతుగా వుండక పూడిపోవుట వలన ఆ

కోటకు ధనలోభము, స్త్రీలకు పూర్ణాయువు కలుగుచు, పురుషులకు ఆయువు మధ్యమము కలుగును. ఈ సత్యాఽసత్యములరయుటకు అనేక ప్రాచీన శిథిల కోటలను పరీక్షించిన పాఠకులకు యదార్థము బోధపడును.




## నీరు పోవు మార్గ దిశలు

శ్లో॥ *అన్యగేహ ప్రవాహంచ స్వగృహేగత్వే తా యధా।*
*హానిశ్చ కలహం చైవ కురుతే నాస్తి సంశయః॥*

ఇతరుల స్థలములోని వర్షపు నీరుగాని, వాడుకున్న నీరుగాని స్వంత స్థలములోనికి రాకూడదు. ఒకవేళ వచ్చెనేని కలహము, హాని సంభవించును. పైగా స్థిరమైన ఆస్థి నాస్తి యగును.

శ్లో ॥ *ప్రాగీశాన్య కుబేర దేవ గళితం తోయం శుభం సర్వదా॥*

తూర్పు, ఈశాన్య, ఉత్తర దిశల మీదుగా వాననీరు, వాడుక నీరు పారుదల గల భూమి అత్యున్నతమైనది అగును.

## ప్రత్యేక దిశ నీరువాటు ఫలము

శ్లో॥ శ్రియం దాహం తథా మృత్యుః ధనహాని సుతక్షయమ్।
ప్రవాసం ధనలాభంచ, విద్యాలాభం క్రమేణచ॥
విదధాత్యచిరేణైవ పూర్వాది స్రవతోమహీ।
మధ్యప్లవో మహీనేష్టా న శుభా వసతస్మృతా॥
ఏవమన్యైర వ్యక్తమ్.

శ్లో॥ శంభోకోణప్లవా భూమిః కర్తుః శ్రీ సుఖదాయినీ॥
పూర్వప్లవా వృద్ధి కరీ। ధనదా తూత్తరప్లవా ।
మృత్యుశోకప్రదా నిత్యం, సర్వదా దక్షిణప్లవా ।
గృహక్షయ కరీ సా చ, భూమి ర్యా నైరుతిప్లవా ।
ధనహాని కరీ చైవ కీర్తిదా వరుణప్లవా॥
తథా భూమి ర్నిత్యముద్వేనకారిణేతి ॥

వాన నీరు, వాడుక నీరు తూర్పు, ఆగ్నేయము, దక్షిణము, నైరుతి, పశ్చిమము వాయవ్యము, ఉత్తరము, ఈశాన్యము మీదగా ప్రవహించిన క్రమముగా సంపదను, దాహమును, మరణమును, ధనహాని, పుత్ర నాశనము, ప్రవాసము, ధన లాభము, విద్యా లాభము కలుగజేయును. మధ్య ప్రవాహము గల భూమి నివాసయోగ్యము కాదని ఎరుగవలయును. ఈశాన్య ప్రవాహము గల భూమి కర్తకు శ్రీ సుఖము కలుగును తూర్పు ప్రవాహము గల భూమి పుత్ర వృద్ధి జేయును ఉత్తర ప్రవాహము గల భూమి విశేష ధనమును ఇచ్చును దక్షిణ ప్రవాహముగల భూమి మృత్యువు లేక నిత్య శోకప్రదమున్ను, నైరుతీ ప్రవాహము గల భూమి ధనక్షయాన్ని కలుగజేయును పశ్చిమ ప్రవాహము గల భూమి కర్తకు కీర్తిని కలుగజేయును

శ్లో॥ మనోరమాచ యా భూమిః పరీక్షేత్ర ప్రయత్నతః ।
ద్వితీయం దృఢభూమిశ్చ నిమ్నో చోత్తర పూర్వతే ॥

మనోహరమైన భూమిని పరిశీలన చేయవలయును. ఉత్తరమునందును, తూర్పునందును పల్లముగను, నీరుపోవుటకు వీలు గలదిగను, దృఢమైనదిగను అగు భూమి యందు గృహారామ నిర్మాణములు చేసినేని సిరి సంపదలే కాక, చక్కని బిడ్డలు, కలిమి, ఉద్యోగ సంపదలు కలుగును

## కొన్ని శాస్త్రానుభవ క్షేత్ర నిరూపణములు

తిరుపతి దేవస్థానము పరీక్ష చేయగా విశేష ధనవర్గు, పురుష వర్గుగా కనిపించుచున్నది. అందువలన ఆకర్షణ శక్తి కలదు. దేవాలయమునకు పశ్చిమమున, దక్షిణమున ఎత్తుగల కొండ ప్రదేశము కలదు. ఉత్తరమున జలపూరితమైన కోనేరుకలదు. కోనేరుకు ఉత్తరమున పోను పోను లోతు గల లోయ ప్రదేశము కలదు. దానినే పాపనాశనమందురు. ఇట్లు ఉండుట వలననే జనాకర్షణ, ధనాకర్షణ వున్నది. వివిధ ప్రాంతముల నుంచి ప్రజలు వచ్చి ఈ దేవునకు ధనము, సువర్ణ అలంకారములు అర్పించుచున్నారు కొంత మంది యాత్రీకులు ఆ మార్గము మీదుగా కాళహస్తి దేవస్థానమును దర్శించెదరు ఈ దేవునకు అర్పించుటకు ఏమియు లేక శూన్య హస్తములతో దర్శించెదరు. దీనికి కారణము, కాళహస్తి దేవస్థానము ఋణవర్గులో వున్నది. ఈ దేవస్థాన క్షేత్రము పరిశీలింపవలెను ఈ దేవస్థానమునకు పశ్చిమ, నైరుతిగా సువర్ణముఖి నది వుండుట వలన, దక్షిణమున నీచ ప్రదేశము వుండుట వలన, తూర్పు, ఉత్తరములు ఉచ్ఛ గల ప్రదేశములు వుండుటవలన ఇది ఋణవర్గు అయినది. అందువలన ఈ దేవునకు జనాకర్షణ, ధనాకర్షణ లేకపోయినది.

పాఠకులు నెల్లూరులో ఉన్న శ్రీరంగనాయకుల దేవస్థానము పరిశీలింపవలెను. ఈ దేవస్థానమునకు పెన్నానది పశ్చిమమున మొదలు ఉత్తరముగా తిరిగి ప్రవహించు చున్నది అందువలన ఆ క్షేత్రము కన్యవర్గు, ధనవర్గు అయి స్త్రీలను, ధనమును ఆకర్షించుచున్నది

కొంతమంది ప్రజలు దేవుని మహాత్మ్యమే కాని వాస్తు శాస్త్ర ప్రభావములేదని వాదించెదరు. సూక్ష్మముగా విచారించినచో వారికే బోధపడును. దేవుని శక్తి ఎల్లప్పుడు ఒక రీతిగనే వుండును. కాని, ఆ దేవుడు ఉండు స్థానమును బట్టి జనాకర్షణ, ధనాకర్షణ కలుగును దేవాలయములు నిర్మించు క్షేత్రములు సరియైనవి కానిచో ఆ దేవాలయములు కొన్నాళ్ళకు జనాకర్షణ కోల్పోయి, శిధిలము చెందును. పై చెప్పిన రీతిగనే ఒక క్షేత్రము వాస్తు శాస్త్రరీత్యా మంచిదైనప్పుడు, అందులో నిర్మించిన యంత్రశాలలు కూడా వృద్ధిచెందును కృష్ణాజిల్లా ఉయ్యూరులో నిర్మించిన పంచదార యంత్రశాలను పరిశీలింపవలెను ఈ యంత్రశాల నిర్మించిన క్షేత్రమునకు ఉత్తరమున ఒక కాలువ కలదు అది తూర్పు వైపునకు తిరిగి ప్రవహించుచున్నది. ఈ భూమికి దక్షిణమున సమాన ఎత్తుగల బందరు, బెజవాడ రోడ్డు కలదు. పశ్చిమమున కట్టెల అడితిలు కలవు ఈ భూమికి ఉత్తర, ఈశాన్య, తూర్పు దిశలలో కాలువ ప్రవహించి నందువలన (నీచ స్థలము వుండుట వలన) ధనవర్గు అయి, దినదినాభివృద్ధి పొందుచున్నది

# రెండవ అధ్యాయము

## క్షేత్రపటములు

నెంబరు ఒకటి   1. కాలువ   2. బెజవాడ - బందరు రోడ్డు

ఉత్తరము




దక్షిణము

పశ్చిమము

ఈ క్షేత్రము చాలా విస్తీర్ణము గల భూమి. ఉత్తరదిశలో పెద్ద కాలువ వుండి తూర్పుగా వెళ్ళి అచ్చటనుండి దక్షిణమునకు తిరిగి. తూర్పునకు పోయినది. ఈ మధ్యస్థలము చాలా విస్తీర్ణముగా వున్నది. ఆ స్థలములో పంచదార ఫ్యాక్టరీ నిర్మించిరి. అది ఇప్పుడు యోగప్రదముగా వున్నది. ఈ స్థలములో పశ్చిమమున కళ్ళల అడితీలు

వున్నవి. అన్నియు చాలా బాగుగా వున్నవి. ఈ స్థలము యొక్క మహాత్మ్యము విమర్శించెదరుగాక, ఈ ప్లాను ప్రదేశము కృష్ణాజిల్లా ఉయ్యూరులో ఉన్నది.

## నెంబరు రెండు

దిశగల విశాలమైన భూమిని, గృహ నిర్మాణమునకు క్రింద ఉదహరించిన రీతిగా తూర్పు పశ్చిమ ప్రతులు తీర్చవలయును.

తూర్పు

6

ఉత్తరము

దక్షిణము

1 2 3 4 5

పశ్చిమము

1 ఉత్తర ముఖము గల ప్రతులు

2. దక్షిణ ముఖము గల ప్రతులు

3 ఉత్తర ప్రతులకు రాజవీధి

4 ఉత్తర ప్రతులకు వాన, వాడుక నీరుపోవు చిన్న కాలువ

5. ఉత్తర దక్షిణ ప్రతులకు మధ్య ఆరు అడుగుల సందు

6. దీర్ఘ తటాకము

దక్షిణ, ఉత్తర ప్రతులకు మధ్య ఆరు అడుగుల సందు లేసి ఎడల దక్షిణ ప్రతులు అన్నీ ఋణవర్గులు అగును గాన, ముఖ్యముగా సందు ఉండవలెను ఉత్తర ప్రతులకు ఉత్తర సింహద్వారములు, దక్షిణ ప్రతులకు దక్షిణ సింహద్వారములు గల గృహములు నిర్మించవలయును.

**నెంబరు మూడు**

తూర్పు

ఉత్తరము

దక్షిణము

1

2

3 4 5

పశ్చిమము

దిశ గల విశాలమైన భూమిని గృహ నిర్మాణములకు పైన ఉదహరించిన రీతిగా ఉత్తర దక్షిణ ప్రతులు తీర్చవలయును.

1. తూర్పు ముఖముగల ప్రతులు
2. పశ్చిమ ముఖము గల ప్రతులు
3. తూర్పు ప్రతులకు రాజవీధి
4. తూర్పు ప్రతులకు వాన, వాడుక నీరు పోవు చిన్న కాలువ
5. తూర్పు, పశ్చిమ ప్రతుల మధ్య ఆరు అడుగుల సందు

తూర్పు, పశ్చిమ ప్రతులకు మధ్య ఆరు అడుగుల సందు లేని ఎడల పశ్చిమ ప్రతులు కన్యవర్గులు అగును. కావున, ముఖ్యముగా సందు ఉండవలయును. తూర్పు ప్రతులకు తూర్పు సింహద్వారములు, పశ్చిమ ప్రతులకు పశ్చిమ సింహద్వారములు గల గృహములు నిర్మించవలయును.

నెంబరు నాలుగు

తూర్పు

| | | | |
|---|---|---|---|
| 1 | 11 | 21 | 31 |
| 2 | 12 | 22 | 32 |
| 3 | 13 | 23 | 33 |
| 4 | 14 | 24 | 34 |
| 5 | 15 | 25 | 35 |
| 6 | 16 | 26 | 36 |
| 7 | 17 | 27 | 37 |
| 8 | 18 | 28 | 38 |
| 9 | 19 | 29 | 39 |
| 10 | 20 | 30 | 40 |

ఉత్తరము — దక్షిణము

1 2 పశ్చిమము

1. ప్రతులకు ఉత్తరము రాజవీధి 2. ప్రతులకు ఉత్తరము చిన్న కాలువ

ఈ క్షేత్రములో అన్ని ప్రతులు ధనవర్గు లగుచున్నవి. కారణమేమనగా, ఉత్తరం నీచ, రాజవీధి, వాన, వాడుక నీరు పోవు చిన్న కాలువ కలవు. ప్రతులకు దక్షిణమున కాలువ వుండరాదు. ప్రతి స్థలములలో నీరు ఉత్తరమునకు పోవుచుండవలయును. అప్పుడు అన్ని ప్రతులు ధనవర్గులగుచున్నవి. ప్రతులకు దక్షిణ, ఉత్తరములు రాజవీధులు వుండుట వలన గృహములకు దక్షిణ, ఉత్తర సింహద్వారములు నిర్మించవచ్చును.

క్రొత్త గ్రామము నిర్మించునప్పుడు ముందు పుటలో ఉదహరించిన రీతిగా ప్రతులు తీర్చి నిర్మించవలయును.

"O" గ్రామ మధ్యమున పార్కు లేక గొప్ప మహనీయుల విగ్రహ ప్రతిష్ఠ చేయు స్థలము. దీని చుట్టూ నాలుగు దిశలయందు దుకాణములకు పనికివచ్చు కొట్లు నిర్మించవలయును.

1. తూర్పు ముఖ ప్రతులు, 2. పశ్చిమ ముఖ ప్రతులు, 3. తూర్పు ముఖ ప్రతులకు వాన, వాడుక నీరు పోవు చిన్న కాలువ; 4. తూర్పు, పశ్చిమ ప్రతులకు మధ్య రాజవీధి, 5. ఉత్తర ముఖ ప్రతులు, 6. దక్షిణ ముఖ ప్రతులు; 7. ఉత్తర, దక్షిణ ప్రతుల మధ్య రాజవీధి, 8. ఉత్తర ప్రతులకు వాన, వాడుకనీరు పోవు చిన్న కాలువ, 9. ఖాళీస్థలములు.

నెంబరు ఆఱు



ఈ క్షేత్రములో తూర్పు పశ్చిమములుగాను, ఉత్తర దక్షిణములుగాను తీర్చిన ప్రతుల మధ్య ఆరు అడుగుల సందు ఉండవలయును వాటి ద్వారా పశ్చిమ ముఖము గల ప్రతుల, దక్షిణముఖము గల ప్రతుల వాన, వాడుక నీరు ప్రవహించును అలా చేయని ఎడల పశ్చిమ ప్రతులకు కన్యవర్గు దోషము, దక్షిణ ప్రతులకు ఋణవర్గు దోషములు కలుగును.

1) తూర్పు ముఖము గల ప్రతులు
2) పశ్చిమ ముఖము గల ప్రతులు
3) తూర్పు, పశ్చిమ ప్రతులకు రాజవీధి
4) తూర్పు ప్రతులకు వాన, వాడుక నీరు పోవు చిన్న కాలువ
5) తూర్పు, పశ్చిమ ప్రతులకు మధ్య ఆరు అడుగుల సందు

పశ్చిమ ప్రతుల వాన, వాడుక నీరు ఆ సందు ద్వారా పోవలెను

ఈ క్షేత్రము ఖర్జూరకాయాకారము గలది

## విదిక్కు గల భూముల విమర్శన

కొన్ని పట్టణములు, గ్రామములు సరియైన దిశలో లేక విదిశల యందు వున్నవి అచ్చట గృహములు విదిక్కునకు నిర్మించి ఉన్నవి దిక్కులో ఉన్న స్థలము కంటె విదిక్కులో ఉన్న స్థలమును బహుజాగ్రత్తగా పరిశీలించి గృహనిర్మాణములు చేయవలయును.

ఒక స్థలమునకు ఈశాన్యదిశలో వీధి వున్నప్పుడు, ఆ స్థలములో వానను, వాడుక నీరు ఉత్తర మూలకో, తూర్పు మూలకో పోవును. ఆ స్థలము చాలా మంచిదగును. ధనవర్గు, పురుషవర్గు అగును

ఒక స్థలమునకు నైరుతి వీధి ఉన్నప్పుడు వాన నీరు, వాడుకనీరు దక్షిణ మూలకో, పశ్చిమ మూలకో ప్రవహించును. ఉచ్చస్థానము నీచయగుట వల్ల ఋణవర్గు, కన్యవర్గు అగును. కాన, అప్పుడు ఈశాన్యమున సందు ఉండవలెను అలా వుండెనేని అన్ని సౌఖ్యములు కలుగును.

ఒక స్థలమునకు ఆగ్నేయమున వీధి ఉన్నప్పుడు ఆ స్థలము ఋణవర్గు అగును రాను రాను చాలా కష్టములు కలిగి, ఋణముల పాలగును కావున వాయువ్య దిశలో చిన్న సందు ఉండవలెను లేని ఎడల పైన చెప్పిన దోషములు కలుగును

ఒక స్థలమునకు వాయవ్య దిశలో వీధి ఉన్నప్పుడు ఆ స్థలము కన్యవర్గు అగుచున్నది. కాన, ఈశాన్య దిశలో చిన్న సందు ఉన్న ఎడల సకల సౌఖ్యములు, అఖండ ధనయోగము కలుగును గృహ స్థలములు తీర్చినప్పుడు విదిక్కులో వున్న భూమిని చాలా జాగ్రత్తతో నాలుగు పలకలుగా పెద్దవీధులు, చిన్న సందులు తీర్చిన స్థలములలో గృహములు మొదలగునవి నిర్మించుకోవలెను.

## నెంబరు ఏడు

ఈశాన్యము

దీర్ఘతటాకము

పార్కు

వాయవ్యము

ఆగ్నేయము

నైరుతి

విదిక్కు గల భూములలో గృహ నిర్మాణమునకు ప్రతులు తీర్చిన ఎడల పైన ఉదహరించిన ప్రకారము తీర్చవలయును.

1) రాజవీధి

2) ఈశాన్య ప్రతుల వాన, వాడుక నీరు ప్రవహించు చిన్న కాలువ.

3) ఈశాన్య, నైరుతి ప్రతుల మధ్య ఆరు అడుగుల సందు

నైరుతి ప్రతుల వాన, వాడుక నీరు యీ సందుద్వారా ప్రవహించును

## నెంబరు ఎనిమిది

ఈశాన్యము




పార్కు లేక
మార్కెట్

వాయవ్యము

ఆగ్నేయము

నైరుతి

విదిక్కు గల భూములలో గృహ నిర్మాణమునకు ప్రతులు తీర్చిన ఎడల పైన ఉదహరించిన ప్రకారము తీర్చవలయును

1) పెద్ద రాజవీధి

2) రెండు ప్రతుల మధ్య ఆరు అడుగుల సందు

ఆగ్నేయ ప్రతుల వాన, వాడుక నీరు ఆరు అడుగుల సందులోకి ప్రవహించును. వాయవ్య ప్రతుల వాన, వాడుకనీరు రాజవీధిలో ఉత్తరదిశగా ప్రవహించును

# మూడవ అధ్యాయము

## క్షేత్ర అర్వాణ ఖండము

*క్షేత్రస్యాకచటాః క్రమాతపయశా వర్గాస్స్యురష్టౌ స్థితాః ।*

*ప్రాగాదౌఖగరాడ్బిడాలమృగరాట్ఛ్వాహ్యాఖునాగశ్శశః ।*

*స్యాద్వర్గాద్యదిపంచమోరి రథదిగ్వర్గేషు యోని స్త్రీయమ్॥*

*దౌదౌదిక్షు విదిక్షు చైక మఖిలం మేషాది పూర్వాదితః ॥*

గృహము నిర్మించే భూమికి తూర్పు మొదలు ఈశాన్యము వరకు 50 అక్షరాలను అ, క, చ, ట, త, ప, య, శ అను ఎనిమిది ప్రథమాక్షర వర్గులుగను- వీటికి ఇంద్ర, అగ్ని, యమ, నైరుతి, వరుణ, వాయువ్య, కుబేర, ఈశాన్య అష్టదిక్పతులు వర్గాధిపతులుగను-గరుడము, మార్జాలము, సింహము, శునకము, సర్పము, మూషికము, గజము, శశములు వర్గు జంతు సాంజ్ఞగాను ఏర్పడినవి.

గృహ యజమాని యొక్క నామ ప్రథమాక్షరము ఏ వర్గునందు వుండునో, ఆ వర్గునకు పంచమ స్థానము- అనగా అయిదవ స్థానము శత్రువర్గు అగును. కాన ఆ శత్రువర్గు గల స్థానము వదలి గృహ నిర్మాణము చేయవలయును.

ఉ॥ ఆదియ్య అను పేరు గలవానికి తూర్పు స్వవర్గు అయినది. దానికి అయిదవ స్థానము-పశ్చిమ స్థానము-శత్రువర్గుయైనది. కాన, పశ్చిమస్థానము వదలి గృహ నిర్మాణము చేయవలెను.

జగ్గయ్య యనువానికి దక్షిణము స్వవర్గు అయినది దానికి పంచమస్థానము శత్రువర్గు అయినది కాన, ఉత్తర స్థానము వదలి గృహ నిర్మాణము చేయవలెను.

ఈ విధముగా 50 అక్షరములు నామములయొక్క ప్రథమ అక్షరములతో సరిచూచుకొనవలెను

క్షేత్ర అర్వాణ చక్రములో ఉదహరించియున్నాను

## క్షేత్ర అర్వణ చక్రము

(నామ ప్రథమాక్షరము ప్రధానము)

ఈశాన్యము తూర్పు ఆగ్నేయము

ఉత్తరము దక్షిణము

| | | |
|---|---|---|
| 'శ' వర్గు, శశము, శ, ష, స, హ, ళ | 'అ' వర్గు, గరుడము, అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఏ, ఐ, ఓ, ఔ | 'క' వర్గు, పిల్లి, క, ఖ, గ, ఘ, ఙ |
| 'య' వర్గు, ఏనుగు, య,ర,ల వ | | 'చ' వర్గు, సింహము, చ, ఛ, జ, ఝ, ఞ |
| 'ప' వర్గు, ఎలుక, ప, ఫ, బ, భ, మ | 'త' వర్గు, సర్పము, త, థ, ద, ధ, న | 'ట' వర్గు, శునకము, ట, ఠ, డ, ఢ, ణ |

వాయవ్యము పశ్చిమము నైరుతి

పై శ్లోకమును బట్టి చక్ర ప్రచారము వ్రాసినాను నామ ప్రథమాక్షరమునుబట్టి స్వవర్గు, మిత్రవర్గుల యందు గృహము నిర్మించుకొని శత్రువర్గు విడిచిపెట్టవలెను.

## ఎనిమిది దిక్కు విదిక్కుల రాశి నిర్ణయము

శ్లో॥ **దౌదౌదిక్షు విదిక్షు చైకమఖిలం మేషాద పూర్వాదితః॥**

అను ప్రమాణమును బట్టి పక్షాంతరమున పై వర్గు ననుసరించి రాశి రీత్యా కూడా చూచుకొనవలయును.

## రాశిచక్ర ప్రచారము

| ఈశాన్యము | తూర్పు | ఆగ్నేయము |
| --- | --- | --- |
| మీనము | మేషము, వృషభము | మిధునము |
| కుంభము<br>మకరము | | కర్కాటకము<br>సింహము |
| ధనుస్సు | వృశ్చికము, తుల | కన్య |
| వాయవ్యము | పశ్చిమము | నైఋతి |

## ఎనిమిది దిక్కు విదిక్కుల ఫలములు

శ్లో॥ *ఏకస్మిన్ యది పంచమేవ నవమే స్యాద్బంధు సంరక్షకో ।*
*నాశస్స్యా ద్వితయేచ షష్ఠ దశమే చేన్నామరాశ్యాదితః ।*
*తార్తీయే యది సప్తమే పరజనైః పోష్యస్తథైకాదశే ।*
*చాతుర్థేచ సఘాతుకో గృహపతి స్థాయ్యష్టమే ద్వాదశే॥*

గృహ యజమాని నామ నక్షత్ర రాశి మొదలు 1-5-9 స్థానములు బంధు పోషకునిగా చేయును. 2-6-10 స్థానములు నాశనము చేయును. 3-7-11 స్థానములు పరులచేత పోషింపజేయును. 4-8-12 స్థానములు పరులను నాశనము చేయును ఈ రాశుల యొక్క భావము వర్గులతో మిశ్రమము చేసి క్షేత్ర అర్పణము చూచుకొనుట వలన శుభములు కలుగును.

శ్లో॥ *ఏకేన ధనలాభం చ ద్వితీయం చరవీనకమ్।*
*తృతీయ వీన మిత్యాహుః చతుర్థం వ్యాధిపీడితమ్ ।*

*పంచమం రిపుస్థానం చ షష్ఠంతు కలహప్రదమ్।*
*సప్తమం సర్వసౌభాగ్యం అష్టమం మరణం ధ్రువమ్॥*

గృహ యజమాని నామ ప్రథమాక్షరము ఏ వర్గునందుండునో అది మొదలు స్వవర్గ ధనలాభము; రెండవస్థానము అరవీస మరుబలము; మూడవస్థానము వీసము బలము; నాల్గవ స్థానము వ్యాధి భయము, పంచమ స్థానము శత్రుభయము, ఆరవ స్థానము కలహము, ఏడవ స్థానము సర్వ సౌభాగ్యము, ఎనిమిదవ స్థానము మరణ భయము.

ఈ ఎనిమిది స్థానములు ఆయా ఫలములు కలుగచేయును. అనగా జనార్ధనుడను పేరు గలవానికి దక్షిణము "చ" వర్గు స్వస్థానము నైఋతి "ట" వర్గు రెండవ స్థానము మంచిది. పశ్చిమము "త" వర్గు రెండవ స్థానము సౌఖ్యము. వాయవ్యము "ప" వర్గు నాలుగవ స్థానము వ్యాధి భయము ఉత్తరము "య" వర్గు అయిదవ స్థానము శత్రుభయము ఈశాన్యము "శ" వర్గు ఆరవ స్థానము కలహము. తూర్పు "అ" వర్గు ఏడవ స్థానము సర్వ సౌభాగ్యము ఆగ్నేయము "క" వర్గు ఎనిమిదవ స్థానము మరణ భయము. ఈ విధముగా నామ ప్రథమ అక్షరము ఏ వర్గునందుండునో ఆ వర్గు స్థానము మొదలు 4, 5, 6, 8 స్థానములు వదలి గృహ నిర్మాణములు చేయవలెను.

## పక్షాంతరము

శ్లో॥ *స్వవర్గుషష్ఠా విజయాంచలక్ష్మీ త్రిసప్తకోభోగప్రదంచసౌఖ్యమ్*
*ద్వితీయ మర్థ్యం అరివర్ధనంచ పంచాష్టగేహాని మృతి ప్రదంచ॥*

అనుటచేత పై శ్లోకార్థమే స్ఫురించును

## క్షేత్ర అర్వాణ విమర్శనము

### "అ" వర్గు వారు

అచ్యుతరావు, ఆదయ్య, ఇబ్రహీమ్, ఈశ్వర్‌లాల్, ఉమాకాంతరావు, ఊర్వశి, ఋష్యేంద్రమణి, ఏకాంబరమ్, ఓంకారమ్, ఐరావతము, ఔరంగజేబు మొదలగువారు "అ" వర్గు వారు.

ఈ నామముల వారే కాక "అ" వర్గులలో "అ" మొదలు "ఔ" వరకు గల అక్షరములతో ప్రారంభమగు నామములు కలవారు "అ" వర్గు వారగుదురు

తూర్పు : స్వస్థానము "అ" వర్గు విశేష ధన సౌఖ్యము.

ఆగ్నేయము : 2-వ స్థానము "క" వర్గు స్వల్ప సౌఖ్యము.

దక్షిణము : 3- వ స్థానము "చ" వర్గు భోగభాగ్యములు.

నైఋతి : 4 - వ స్థానము "ట" వర్గు రోగభయము.

పశ్చిమము : 5-వ స్థానము "త" వర్గు శత్రుభయము.

వాయవ్యము : 6-వ స్థానము "ప" వర్గు కలహము, హాని.

ఉత్తరము . 7- వ స్థానము "య" వర్గు సర్వ సౌఖ్యములు.

ఈశాన్యము : 8 - వ స్థానము "శ" వర్గు మృత్యుభయము

## "క" వర్గు వారు

కనకరత్నము, ఖగపతి, గణపతి, ఘటోత్కచుడు, జ్ఞానేశ్వరుడు, "క" వర్గులో నాలుగు అక్షరములు నామములు గలవారలకు ప్రథమ ప్రధానాక్షరములకు గుడి, ఏత్వము, ఐత్వము, ఔత్వములున్నను ఈ వర్గాక్షరములలో చెందును

ఆగ్నేయము స్వస్థానము "క" వర్గు సౌఖ్యము.

దక్షిణము 2-వ స్థానము "చ" వర్గు స్వల్ప లాభము.

నైఋతి . 3 - వ స్థానము "ట" వర్గు భోగము, సౌఖ్యము.

పశ్చిమము . 4 - వ స్థానము "త" వర్గు రోగభయము.

వాయవ్యము 5- వ స్థానము "ప" వర్గు కలహము.

ఉత్తరము 6 - వ స్థానము "య" వర్గు కలహము.

ఈశాన్యము 7 - వ స్థానము "శ" వర్గు భాగ్యవృద్ధి.

తూర్పు 8 - వ స్థానము "అ" వర్గు మృత్యు దరిద్రములు.

## "చ" వర్గు వారు

చలపతి, ఛత్రపతి, జగన్నాథ్, ఘటోపాధ్యాయ ఈ నాలుగు ప్రథమాక్షరములతో ప్రారంభమగు నామముల వారికి -

దక్షిణము స్వస్థానము "చ" వర్గు విశేష సౌఖ్యము

నైఋతి 2 - వ స్థానము "ట" వర్గు అల్ప లాభము

పశ్చిమము 3 - వ స్థానము "త" వర్గు అధిక సౌఖ్యము.

వాయవ్యము: 4 - వ స్థానము "వ" వర్గు రోగభయము
ఉత్తరము : 5 - వ స్థానము "య" వర్గు శత్రుపీడనము
ఈశాన్యము : 6 - వ స్థానము "శ" వర్గు కలహభయము
తూర్పు : 7 - వ స్థానము "అ" వర్గు ధన, మిత్ర సౌఖ్యము
ఆగ్నేయము : 8 - వ స్థానము "క" వర్గు దరిద్రము, మృత్యుభయము

## "ట" వర్గు వారు

టార్జహాన్, ఠాకూర్, డేవిడ్ మొదలగువారు ఈ వర్గాక్షర నామములు ఉత్తర హిందూ స్థానములో ఉన్నవి ఆంధ్రప్రదేశములో తక్కువగా ఉన్నవి

నైఋుతి : స్వస్థానము "ట" వర్గు సుఖ సౌఖ్యములు
పశ్చిమము : 2 - వ స్థానము "త" వర్గు అల్ప సౌఖ్యము
వాయవ్యము: 3 - వ స్థానము "ప" వర్గు అధిక సౌఖ్యము
ఉత్తరము : 4 - వ స్థానము "య" వర్గు రోగభయము.
ఈశాన్యము : 5 - వ స్థానము "శ" వర్గు శత్రుభయము
తూర్పు : 6- వ స్థానము "అ" వర్గు కలహభయము
ఆగ్నేయము : 7 - వ స్థానము "క" వర్గు సకల సౌఖ్యము
దక్షిణము : 8 - వ స్థానము "చ" వర్గు మరణభయము

## "త" వర్గు వారు

తమ్మారావు, దానయ్య, ధర్మారావు, నాగేశ్వరరావు ఈ నాలుగు ప్రథమాక్షరములు గల వారికి -

పశ్చిమము : స్వస్థానము "త" వర్గు అధిక లాభము
వాయవ్యము: 2 - వ స్థానము "ప" వర్గు అల్ప శుభము
ఉత్తరము : 3 - వ స్థానము "య" వర్గు అధిక లాభము
ఈశాన్యము : 4 - వ స్థానము "శ" వర్గు రోగభయము
తూర్పు : 5 - వ స్థానము "అ" వర్గు అధిక శత్రువులు.
ఆగ్నేయము : 6 - వ స్థానము "క" వర్గు కలహభయము
దక్షిణము : 7 - వ స్థానము "చ" వర్గు సౌభాగ్య లాభము.
నైఋుతి : 8 - వ స్థానము "ట" వర్గు మరణభయము

## "ప" వర్గు వారు

పల్లయ్య, ఫణిభూషణ్, బలరామయ్య, భద్రయ్య, మల్లేశ్వరరావు. ఈ అయిదు ప్రధమ నామాక్షరములు గల వారలకు -

వాయవ్యము స్వస్థానము "ప" వర్గు భాగ్యవృద్ధి.
ఉత్తరము 2 - వ స్థానము "య" వర్గు శుభము.
ఈశాన్యము 3 - వ స్థానము "శ" వర్గు అధిక లాభము
తూర్పు 4 - వ స్థానము "అ" వర్గు వ్యాధి భయము.
ఆగ్నేయము 5 - వ స్థానము "క" వర్గు శత్రు భయము.
దక్షిణము 6 - వ స్థానము "చ" వర్గు రోగ, కలహములు.
నైఋతి 7 - వ స్థానము "ట" వర్గు విశేష లాభము.
పశ్చిమము 8 - వ స్థానము "త" వర్గు మరణ భయము.

## "య" వర్గు వారు

యల్లయ్య, రాఘవయ్య, లక్ష్మణరావు, వేంకటేశ్వరరావు. ఈ నాలుగు నామ ప్రధమాక్షరములు గల వారికి -

ఉత్తరము స్వస్థానము "య" వర్గు చాలా శుభము.
ఈశాన్యము 2 - వ స్థానము "శ" వర్గు సౌఖ్యము
తూర్పు . 3 - వ స్థానము "అ" వర్గు అధిక సౌఖ్యము
ఆగ్నేయము : 4 - వ స్థానము "క" వర్గు వ్యాధి.
దక్షిణము 5 - వ స్థానము "చ" వర్గు కలహము.
నైఋతి : 6 - వ స్థానము "ట" వర్గు కలహము
పశ్చిమము : 7 - వ స్థానము "త" వర్గు భాగ్యవృద్ధి.
వాయవ్యము. 8 - వ స్థానము "ప" వర్గు మృత్యుభయము.

## "శ" వర్గు వారు

శేషారావు, షణ్ముగమ్, సత్యనారాయణ, హనుమంతరావు. ఈ నాలుగు నామ ప్రధమాక్షరములు గలవారికి -

ఈశాన్యము స్వస్థానము "శ" వర్గు ఆనందదాయకము
తూర్పు 2 - వ స్థానము "అ" వర్గు శుభము.

ఆగ్నేయము 3 - వ స్థానము "క" వర్గు అధిక సౌఖ్యము

దక్షిణము · 4 - వ స్థానము "చ" వర్గు వ్యాధి

నైఋతి . 5 - వ స్థానము "ట" వర్గు శత్రుభయము

పశ్చిమము : 6 - వ స్థానము "త" వర్గు రోగము, కలహము

వాయవ్యము : 7 - వ స్థానము "ప" వర్గు సర్వ లాభములు

ఉత్తరము . 8 - వ స్థానము "య" వర్గు దరిద్రము, రోగములు

## గమనిక

దక్షిణము "జ్ఞానేశ్వరుని"కి స్వవర్గు అయినప్పుడు దక్షిణ సరిహద్దుమీద గృహము నిర్మించరాదు. కొంచెము స్థలము వదలవలెను పశ్చిమము తిమ్మారెడ్డికి స్వవర్గు అయినప్పుడు పశ్చిమ సరిహద్దు మీద గృహ నిర్మాణము చేయరాదు కొంచెము స్థలము వదలుట ఉత్తమము.

## నివేశన స్థల నిర్ణయము

శ్లో॥ నివేశనం రంధ్రమితంచ కుర్యాన్ముఖంచ తద్దిక్షు పిశాచభాగమ్।
ద్విభాగ మాత్రామలసంగదాత్రీగృహం తృతీయే శుభదంపదంతి
వేదేషు భాగాఃకిలదేశయోగ్యాః పరిస్తరేచోత్రమభాగ్యసంఖ్యాః॥

గృహ నివేశ స్థానమును అనగా గృహ నిర్మాణ స్థల ప్రతి దిశను తొమ్మిది భాగములు చేసి, మొదటి భాగమును పిశాచ భాగముగను, రెండవ భాగము పెరడు భాగముగను వదలి, మూడవ భాగము వద్ద నుంచి గృహ నిర్మాణము చేయుట, మిగిలిన భాగము గృహము యొక్క ముందు భాగముగా వదలుట అలా ఉత్తమమైనదని శౌనక ఋషి మతము. కావున, ఉత్తరము స్వస్థానమైనప్పుడు ఉత్తర గృహము అర్వణమైనదని ఉత్తర సరిహద్దు గోడమీద గృహనిర్మాణము చేయరాదు అవివేకముచే గృహ నిర్మాణము చేసిరేని, ఆ గృహమునందు ధనము ఉండక ఋణముల పాలు చేయును. కాన, గృహమునకు నాలుగు దిశలలో ఖాళీస్థలము వదలవలెను, ఉత్తరము స్వ వర్గయినప్పుడు ఉత్తరమున రెండు భాగములు వదలి గృహనిర్మాణము చేసిన దక్షిణమున రెండు భాగముల కంటే ఎక్కువఖాళీ ఉండవలయును తూర్పు స్వ వర్గయినప్పుడు తూర్పున ఖాళీ కొద్దిగా వుంచి, గృహముకట్టి మిగిలిన ఖాళీ పశ్చిమమున ఎక్కువగా వుంచవలయును ప్రతి గృహమునకు రెండు భాగముల స్వస్థానము విడిచి మిగిలిన దిశలలో కొంచెముగానైన ఖాళీ వదలవలయును

ఉదాహరణ పటము



# నాలుగవ అధ్యాయము

## గృహ అర్పణ ఖండము

కొంతమంది పండితులు గృహ సింహద్వారము ఏ దిశ నున్నను స్థలమునకు తూర్పున కట్టిన ఇల్లు తూర్పు ఇల్లనియు, పశ్చిమమున కట్టిన ఇల్లు పశ్చిమ ఇల్లనియు ఉత్తరమున కట్టిన ఇల్లు ఉత్తర ఇల్లనియు, దక్షిణమున కట్టిన ఇల్లు దక్షిణ ఇల్లనియు చెప్పుచున్నారు. ఈ విధముగా నిర్మించిన గృహములు వ్యతిరేక ఫలముల నిచ్చుచున్నవి ఇట్లు చెప్పుట చాలా తప్పు ఎందులకనగా, ఒక స్థలములో గృహము కట్టి నాలుగు వైపుల ఖాళీస్థలము ఉంచిన ఎడల ఆ గృహమును ఏ గృహమని చెప్పవలయును?

మరికొంతమంది పండితులు తూర్పు సింహద్వారము కల ఇల్లు తూర్పు గృహమని చెప్పుచున్నారు. సింహద్వారమునుబట్టి గృహమును నిర్ణయించుచున్నారు. ఇట్లు కట్టించిన గృహములు కూడా వ్యతిరేక ఫలముల నిచ్చుచున్నవి వీరి అభిప్రాయ ప్రకారము "య" వర్గు వారికి ఉత్తరము, స్వవర్గు కనుక ఉత్తర సింహద్వారముపెట్టి కట్టించుచున్నారు. ఆ గృహము శత్రు గృహమగుచున్నది. అందువలన యజమానికి శత్రుభయము, ప్రాణభయము, ధనభయము, వ్యాజ్యకారణములు కలుగుచున్నవి. ఈ గృహములో అపజయము కలుగుచున్నది ఎందుకనగా గజాయము గలవారికి సింహాయ గృహమగుచున్నది సింహమునకు ఏనుగునకు ఎంత శత్రుత్వమో గృహ యజమానునకు ఆ గృహమునకు అంత శత్రుత్వము కలుగుచున్నది అలా చేయుటవలన ఆపదల పాలగుచున్నారు. క్రింద కొన్ని తార్కాణములు

సూ: *నరస్యేదిక్ తదానుగమనే ।*

*తద్దిశేత్ గృహనామం భవేత్ ॥*

గృహ యజమాని ఏ దిశగా తన గృహమునందు ప్రవేశించునో ఆ దిశ గృహనామ మేర్పడు చున్నది. తూర్పు సింహద్వారమైనపుడు ఆ గృహయజమాని పశ్చిమ ముఖముగా ప్రవేశించును గాన, ఆ గృహము పశ్చిమ ఇల్లగుచున్నది. మరియు వాస్తు పురుషుని దృష్టి ప్రసరించువైపున ద్వారము పెట్టవలయును.

పశ్చిమముగా దృష్టి ఉన్న ద్వారమువల్ల తూర్పు ఇల్లయినది. దక్షిణముగా దృష్టి ప్రసరించునప్పుడు దక్షిణ సింహద్వారము పెట్టిన, ఉత్తరపు ఇల్లయినది అదియునుగాక, కాలామృత గ్రంథ షష్టమ బిందులో అభిప్రాయము కూడా సరిపోయినది.

శ్లో॥ *కృత్వాదేన దాస్య నిర్మిత గృహ క్షేత్ర నవ స్వేవత॥*

అనుటచేత, మయుని అభిప్రాయమే అగుచున్నది.

## వర్గు రీత్యా ద్వార నిర్ణయము

శ్లో॥ *అకచాః పశ్చిమద్వారం ట వర్గః పశ్చిమోత్తరే ।*
*ధనదే తప వర్గౌచ యశౌ పూర్వేతు పశ్చిమే ।*

'ఎనిమిది' వర్గాక్షరములకు నాలుగు దిశల సింహద్వారములు నిర్ణయము చేయబడెను. అ వర్గు, "క" వర్గు, "చ" వర్గులకు పశ్చిమ ద్వారములు, "ట" వర్గునకు పశ్చిమ, ఉత్తరద్వారము, "య" వర్గు, "శ" వర్గులకు తూర్పు, పశ్చిమ ద్వారములు నిర్ణయము చేయబడెను.

## రాశి రీత్యా ద్వార నిర్ణయము

శ్లో॥ *ప్రాహుః ప్రాఙ్ముఖమంత్యవృశ్చిక కుళీరాణాంప్రచేతోముఖమ్।*
*జూకోపాంత్యగవాం యమాస్యమబలా యుగ్మేణకాణాంహితమ్।*
*సౌమ్యాస్యం గృహమాద్య సింహధనుషా మత్రేష్టకాష్ఠాననమ్ ।*
*కృత్వాప్రాన్యక కుబ్జవాక్షవదనం తత్కార్య మాస్వంస్యచేత్ ॥*

మీన, వృశ్చిక, కర్కాటక రాశుల వారికి తూర్పు ద్వారము, పడమటి ఇల్లు.
తుల, కుంభ, వృషభ రాశుల వారికి దక్షిణ ద్వారము, ఉత్తరపు ఇల్లు.
మిధున, కన్యా, మకర రాశుల వారికి పశ్చిమ ద్వారము, తూర్పు ఇల్లు.
మేష, సింహ, ధనుః రాశుల వారికి ఉత్తర ద్వారము, దక్షిణపు ఇల్లు.
ఈ రీతిగా ముఖద్వారము - అనగా సింహద్వారము ఉండవలెననిరి.

సింహద్వారము వర్గు ననుసరించి పెట్టిన సౌఖ్యము. గృహాలంకారముల కొరకు రెండవ రకము ద్వారములు నాలుగు దిశలయందు ద్వార వేధలు లేకుండా పెట్టుకొనవచ్చును. మిధునరాశి వారికి మాత్రము ద్వార నిర్ణయము అనుభవమునకు వ్యతిరేకముగా ఉన్నది. ముఖ్యముగా ఎనిమిది వర్గులను, పన్నెండు రాశులను సమీకరణచేసి, ఏబది అక్షరములను నాలుగు దిశలకు, నాలుగు విదిశలకు పంచి,

గృహార్వణమునకు, శాస్త్రానుభవమునకు జతపర్చి క్రింద ఉదహరించి యున్నాను. విదిక్కు సింహద్వారములను గురించి సందేహము కలుగవచ్చును "బందరు" మొదలగు గ్రామములు విదిక్కు కలిగి యుండుటవలన ఉదహరించడమైనది

## "అ" వర్గు వారు

అంజయ్య, ఆదయ్య, ఇబ్రహీమ్, ఈశ్వరలాల్, ఉమాపతి, ఊర్వశి, ఋష్యేంద్రుడు, ఏకాంబరమ్, ఓంకారరావు, ఔరంగజేబు మొదలుగాగల నామములు గలవారికి -

| | |
|---|---|
| తూర్పు సింహద్వారము (పడమటి గృహము) | శత్రుగృహము, అనర్థకము, దరిద్రము |
| ఆగ్నేయ సింహద్వారము (వాయవ్య గృహము) | కలహము , రాచకార్య నష్టము, హాని కలుగును |
| దక్షిణ సింహద్వారము (ఉత్తర గృహము) | చాలా లాభదాయకము, కార్యసిద్ధి. |
| నైరుతి సింహద్వారము (ఈశాన్య గృహము) | రోగ భయము, చాలా దరిద్రము కలుగును |
| పశ్చిమ సింహద్వారము (తూర్పు గృహము) | బంధుమిత్ర స్నేహము, ధన ధాన్య లాభము |
| వాయవ్య సింహద్వారము (ఆగ్నేయ గృహము) | సామాన్యలాభము, దుర్గుణము లుండవు |
| ఉత్తర సింహద్వారము (దక్షిణ గృహము) | భోగ భాగ్యములు,ధన, సౌఖ్య కీర్తులు. |
| ఈశాన్య సింహద్వారము (నైరుతి గృహము) | దరిద్రత, రోగము, ఎల్లప్పుడు వైద్య సహాయము వుండును |

## "క" వర్గువారు

కనకరత్నము, గంగాధరము, ఖగపతి, ఘనశ్యాముడు, జ్ఞానేశ్వరుడు యీ ప్రధమాక్షరములకు ఏత్వము, ఐత్వములు, ఓత్వములు, ఔత్వములు వున్నను "క" వర్గుగానే వర్తించును.

| | |
|---|---|
| తూర్పు సింహద్వారము (పడమటి గృహము) | దరిద్రము, రోగము, పదభ్రష్టత్వము |

| | |
|---|---|
| ఆగ్నేయ సింహద్వారము (వాయవ్య గృహము) | శత్రుబాధ, అకారణ ధనక్షయము. |
| దక్షిణ సింహద్వారము (ఉత్తర గృహము) | రాజకీయఅవమానము, ధననష్టము. |
| నైరుతి సింహద్వారము (ఈశాన్య గృహము) | సర్వ సౌభాగ్యము ఇష్ట కార్యసిద్ధి. |
| పశ్చిమ సింహద్వారము (తూర్పు గృహము) | త్రిప్పట, దరిద్రము, భ్రష్టత్వము. |
| వాయవ్య సింహద్వారము (ఆగ్నేయ గృహము) | ప్రభు మిత్రత్వము, ధనలాభము, కార్యదీక్ష. |
| ఉత్తర సింహద్వారము (దక్షిణ గృహము) | ధనలాభము, సకల సౌఖ్యములు, |
| ఈశాన్య సింహద్వారము (నైరుతి గృహము) | చాలా లాభదాయకము, సౌఖ్యములు కలుగును. |

## "చ" వర్గు వారు

చంపతి, ఛటోపాధ్యాయ, జగన్నాథం, ఝుకోరాసింగ్. ఈ నాలుగు ప్రధమాక్షర నామములు గలవారలకు -

| | |
|---|---|
| తూర్పు సింహద్వారము (పశ్చిమ గృహము) | భోగ భాగ్యములు, బంధుపోషణ. ధనము |
| ఆగ్నేయ సింహద్వారము (ఉత్తర గృహము) | వ్యాధి భయము, ధన వ్యయము, కలహము. |
| దక్షిణ సింహద్వారము (ఉత్తర గృహము) | శత్రుబాధ, ఋణబాధ. |
| నైరుతి సింహద్వారము (ఈశాన్య గృహము) | కలహము, శరీర రోగ సంబంధ ధన నష్టము. |
| పశ్చిమ సింహద్వారము (తూర్పు గృహము) | సంరక్షకుడు, ఆడ పెత్తనము, సంపదలు కల్గును. |
| వాయవ్య సింహద్వారము (ఆగ్నేయ గృహము) | దరిద్రము, మృత్యు భయము, ధన లోభము |
| ఉత్తర సింహద్వారము (దక్షిణ గృహము) | ధనము, విశేష లాభము, జనాకర్షణ, సౌఖ్యము |
| ఈశాన్య సింహద్వారము (నైరుతి గృహము) | సామాన్య స్థితి, అపకారం వుండదు |

## "ట" వర్గు వారు

టపాదాస్, రాకూర్, డమర్‌సింగ్ ఈ "ట" వర్గులో అక్షర నామములు హిందూ మతములకంటే ఇతర మతములలో ఈ అక్షరనామములు ఉండవచ్చును

| | |
|---|---|
| తూర్పు సింహద్వారము (పశ్చిమ గృహము) | సామాన్య ఫలితో ఉండును |
| ఆగ్నేయ సింహద్వారము (వాయవ్య గృహము) | సకల సౌఖ్యము, లాభములు. |
| దక్షిణ సింహద్వారము (ఉత్తర గృహము) | రోగప్రాప్తి, అర్భకత్వం, ధనలోభము. |
| నైరుతి సింహద్వారము (ఈశాన్య గృహము) | శత్రుదోషము, ఋణదోషము |
| పశ్చిమ సింహద్వారము (తూర్పు గృహము) | కలహము, ధనవ్యయము, రాజ్యాపమానము |
| వాయవ్య సింహద్వారము (ఆగ్నేయ గృహము) | విశేష ధనసంపద, స్త్రీ ధనప్రాప్తి |
| ఉత్తర సింహద్వారము (దక్షిణ గృహము) | మరణతుల్యమైన దరిద్ర భయము. |
| ఈశాన్య సింహద్వారము(నైరుతి గృహము) | విశేష ధన సంపద, ఆరోగ్య సౌఖ్యములు కలుగును |

## "త" వర్గు వారు

తమ్మయ్య, దానయ్య, ధర్మరాజు నటరాజ యీ ప్రథమాక్షర నామములు వారలకు -

| | |
|---|---|
| తూర్పు సింహద్వారము (పశ్చిమ గృహము) | ధర్మాదాయము, కీర్తి, సౌఖ్యం, సకల సంపద |
| ఆగ్నేయ సింహద్వారము (వాయవ్య గృహము) | ధనలాభము, తానుచెడక ఇతరులను చెరుపును |
| దక్షిణ సింహద్వారము (ఉత్తర గృహము) | విశేష ధన ప్రాప్తి, సౌఖ్యము, కీర్తి, ఖర్చు |
| నైరుతి సింహద్వారము (ఈశాన్య గృహము) | రోగము, అర్భకత్వము, ధన లోభము |
| పశ్చిమ సింహద్వారము (తూర్పు గృహము) | శత్రుదోషము అడపెత్తనము, ధన వ్యయము. |
| వాయవ్య సింహద్వారము (ఆగ్నేయ గృహము) | కలహము, రాజకార్య నష్టము, అపజయము |

| | |
|---|---|
| ఉత్తర సింహద్వారము (దక్షిణ గృహము) | సకలైశ్వర్యములు, అధిక ధన సౌఖ్యము. |
| ఈశాన్య సింహద్వారము (నైరుతి గృహము) | యీతి బాధలు, ఋణ బాధలు కలుగును. |

## "ప" వర్గు వారు

పాండురంగడు, ఫణిభూషణ్ బలరామయ్య, భద్రయ్య, మల్లికార్జునరావు. యీ ప్రధమ అక్షర నామములు గల వారలకు -

| | |
|---|---|
| తూర్పు సింహద్వారము (పశ్చిమ గృహము) | చాలా అనుకూలవము, ధన సౌఖ్యము |
| ఆగ్నేయ సింహద్వారము (వాయవ్య గృహము) | బంధుపోషణ, ప్రభుత్వ సహాయము |
| దక్షిణ సింహద్వారము (ఉత్తర గృహము) | కించిత్ ధనలోభం కలుగును |
| నైరుతి సింహద్వారము (ఈశాన్య గృహము) | ఆరోగ్యము, సౌఖ్యము, సామాన్య ధనలాభము |
| పశ్చిమ సింహద్వారము (తూర్పు గృహము) | రోగభయము, వైద్య సహాయము, ధన వ్యయము. |
| వాయవ్య సింహద్వారము (ఆగ్నేయ గృహము) | శత్రుభయము, ధన నష్టము, స్త్రీ స్వతంత్రత. |
| ఉత్తర సింహద్వారము (దక్షిణ గృహము) | కలహము, రోగము, ధన వ్యయము కలుగును. |
| ఈశాన్య సింహద్వారము (నైరుతి గృహము) | సర్వసౌఖ్య సకల లాభములు కలుగును. |

## "య" వర్గువారు

యల్లయ్య, రత్నారావు, లక్ష్మీనారాయణ, వరదారెడ్డి యీ ప్రధమాక్షర నామములు గల వారలకు -

| | |
|---|---|
| తూర్పు సింహద్వారము (పశ్చిమ గృహము) | యోగ్యమైనది, విశేష ధనసంపదలు. |
| ఆగ్నేయ సింహద్వారము (వాయవ్య గృహము) | దరిద్రము, భయము, స్త్రీల వల్ల సహాయము. |

| | |
|---|---|
| దక్షిణ సింహద్వారము (ఉత్తర గృహము) | ధనధాన్య వృద్ధి, స్వశక్తి, కీర్తి సుఖము. |
| నైరుతి సింహద్వారము (ఈశాన్య గృహము) | ఋణ బాధ, రోగ బాధ, సామాన్యము |
| పశ్చిమ సింహద్వారము (తూర్పు గృహము) | అఖండ విజయము, స్త్రీ ధన ప్రాప్తి |
| వాయవ్య సింహద్వారము (ఆగ్నేయ గృహము) | రోగ భయము, వ్యాజ్య భయము. |
| ఉత్తర సింహద్వారము (దక్షిణ గృహము) | శత్రు భయము ఎదురీతగా నడుచును. |
| ఈశాన్య సింహద్వారము (నైరుతి గృహము) | ధనవృద్ధి, కలహముతో కూడి యుండును. |

## "శ" వర్గు వారు

శంగల్వరాయుడు, షణ్ముగమ్, సత్యనారాయణ, హనుమంతరావు, యీ ప్రథమాక్షర నామములు గల వారలకు -

| | |
|---|---|
| తూర్పు సింహద్వారము (పశ్చిమ గృహము) | ఎల్లప్పుడు కలహములు, స్త్రీ అధికారము. |
| ఆగ్నేయ సింహద్వారము (వాయవ్య గృహము) | ధన వ్యయము, తాపత్రయము జాస్తి. |
| దక్షిణ సింహద్వారము (ఉత్తర గృహము) | ధన ధాన్య భూ లాభములు కలుగును |
| నైరుతి సింహద్వారము (ఈశాన్య గృహము) | సామాన్య సౌఖ్యము, ధన లాభము కలుగును |
| పశ్చిమ సింహద్వారము (తూర్పు గృహము) | కన్యవర్గు, స్త్రీ ధన ప్రాప్తి, సుఖము. |
| వాయవ్య సింహద్వారము (ఆగ్నేయ గృహము) | భోగభాగ్యములు, స్త్రీ అధికారము. |
| ఉత్తర సింహద్వారము (దక్షిణ గృహము) | ధన లోభము, రోగము, భయము వల్ల క్షయము. |
| ఈశాన్య సింహద్వారము (నైరుతి గృహము) | కలహము, శత్రుభయము |

# ఐదవ అధ్యాయము

## దిశార్వణ ఖండము

దిశార్వణము - ఒక గ్రామము నుంచి మరి ఒక గ్రామమునకు, ఒక పేట నుంచి మరియొక పేటకు కాపురము వెళ్ళుటకు, చదువుకొరకు విద్యార్థులు వెళ్ళుటకు, ఆడపిల్లలకు సంబంధములు ఏ దిశలో కుదురునో - అనే అనేక విషయములు తెలుపును. ప్రతివారు ఏ దిశకు వెళ్ళిన కార్య సాఫల్యమగునో బాగుగా విమర్శించ వలయును దిశలు కూడా సూక్ష్మముగా విమర్శించవలెను.స్థూలముగా విమర్శించరాదు. అలా చేసిరేని కష్టనష్టముల పాలగుదురు.

| నామ ప్రథమాక్షరములు | దిక్కులు | | ఫలములు |
|---|---|---|---|
| | తూర్పు | : | మరువరాని మేలు, లాభము |
| | ఆగ్నేయము | : | స్వల్ప లాభము. |
| అ,ఆ,ఇ,ఈ, | దక్షిణము | : | అధిక సౌఖ్యము. |
| ఉ, ఊ, ఋ, ౠ, | నైరుతి | : | రోగము, దరిద్రము |
| ఏ,ఐ, ఓ,ఔ. | పశ్చిమము | : | మరణతుల్య కలహము. |
| | వాయవ్యము | : | వ్యాజ్య కలహములు. |
| | ఉత్తరము | : | మహా భోగము, లాభము. |
| | ఈశాన్యము | : | హాని, భయము. |

పై ప్రథమాక్షర నామములు గల వారికి ఆయా దిశలు ఆయా ఫలములను కలుగజేయును.

| | | | |
|---|---|---|---|
| | తూర్పు | : | త్రిప్పట, దరిద్రము |
| | ఆగ్నేయము | : | మితిలేని లాభము, సౌఖ్యము |
| క,ఖ,గ, ఘ, ఙ | దక్షిణము | : | స్వల్పలాభము, సుఖము. |
| | నైరుతి | : | అధిక లాభము. |

| | | | |
|---|---|---|---|
| క,ఖ,గ, ఘ, జ | పశ్చిమము | : | దారిద్ర్యము, రోగము |
| | వాయవ్యము | | శత్రు భయము, రోగము |
| | ఉత్తరము | : | వ్యాజ్య కలహములు |
| | ఈశాన్యము | . | భోగము, సౌభాగ్యము. |

యీ అక్షరములకు గుడులు, ఐత్వములు, ఔత్వములు, పున్నుసు ప్రథమ అక్షరములే ప్రధానములు.

| | | | |
|---|---|---|---|
| చ, ఛ, జ, ఝ, ఞ | తూర్పు | : | మిత్ర లాభము, ధన లాభము. |
| | ఆగ్నేయము | : | ప్రాణభీతి, రోగము. |
| | దక్షిణము | : | అధిక లాభము |
| | నైరుతి | : | స్వల్ప లాభము |
| | పశ్చిమము | : | భోగము, భాగ్యవృద్ధి |
| | వాయవ్యము | : | రోగము, దరిద్రము. |
| | ఉత్తరము | : | మితిలేని శత్రుభయము. |
| | ఈశాన్యము | : | కలహము, హాని |

| | | | |
|---|---|---|---|
| ట, ఠ, డ, ఢ, ణ. | తూర్పు | : | కలహము, దరిద్రము |
| | ఆగ్నేయము | : | సకల సౌభాగ్యము |
| | దక్షిణము | · | ప్రాణ భయము |
| | నైరుతి | : | సర్వ సౌఖ్యము, లాభము. |
| | పశ్చిమము | : | స్వల్ప లాభము. |
| | వాయవ్యము | : | మిత్ర, ధన, సౌఖ్యము. |
| | ఉత్తరము | : | రోగము. |
| | ఈశాన్యము | : | రోగ భయము. |

| | | |
|---|---|---|
| త,థ,ద,ధ,న. | తూర్పు: | శత్రు భయము |
| | ఆగ్నేయము: | వ్యాజ్య కలహము, హాని |

| | | | |
|---|---|---|---|
| త,థ,ద,ధ,న. | దక్షిణము | . | విశేష లాభదాయకము |
| | నైరుతి | | మరణ తుల్య భయము. |
| | పశ్చిమము | | బహు ధన, మిత్ర సౌఖ్యము. |
| | వాయవ్యము | . | సామాన్య లాభము. |
| | ఉత్తరము | | ధన ధాన్య సమృద్ధి. |
| | ఈశాన్యము | · | వ్యాధి పీడనము. |

| | | | |
|---|---|---|---|
| ప,ఫ, బ భ,మ. | తూర్పు | | రోగము |
| | ఆగ్నేయము | . | శత్రు భయము |
| | దక్షిణము | . | రోగము, కలహము, ధన నష్టము |
| | నైరుతి | . | భాగ్యోదయము |
| | పశ్చిమము | · | దరిద్రము, రోగము |
| | వాయవ్యము | : | అధిక ధన లాభము |
| | ఉత్తరము | . | స్వల్ప లాభము. |
| | ఈశాన్యము | : | బహు ధన మిత్ర లాభము. |

| | | | |
|---|---|---|---|
| య, ర, ల, వ. | తూర్పు | : | అధిక ధన యోగము |
| | ఆగ్నేయము | : | అధిక రోగ భయము |
| | దక్షిణము | : | శత్రుదోషము, నష్టము |
| | నైరుతి | : | కలహము, హాని |
| | పశ్చిమము | : | సకల సౌభాగ్య ధనవృద్ధి |
| | వాయవ్యము | : | ప్రాణభయము, దరిద్రము |
| | ఉత్తరము | : | ఉత్తమము, ధన లాభము |
| | ఈశాన్యము | : | సామాన్య లాభము. |

| | | | |
|---|---|---|---|
| శ, ష, స, హ,ళ. | తూర్పు | : | సామాన్య మిత్ర ధన లాభము |
| | ఆగ్నేయము | : | ధన సంపద |
| | దక్షిణము | : | రోగము, దరిద్రము |

శ, ష, స, హ,ళ.

నైరుతి : ప్రాణభయము, దరిద్రము.

పశ్చిమము : కలహము, స్త్రీ శక్తి

వాయవ్యము : సకల సంపదలు

ఉత్తరము : దరిద్రము

ఈశాన్యము : సకల సౌభాగ్యములు.

## అష్టభాగ గృహ నిర్ణయము

శ్లో॥ ఐంద్రాం దిశ స్నాన గృహ మాగ్నేయం పచనాలయమ్।
యామ్యాయాం శయనం వేశ్మ నైరుత్యాం శస్త్రమందిరమ్
పశ్చిమ్యాం భోజనగృహం వాయవ్యాం ధాన్యమందిరమ్॥
ఉదీచ్యాం హాటకం సద్మ ఐశాన్యం దేవమందిరమ్॥

తూర్పు

| ఉత్తరము | | | | దక్షిణము |
|---|---|---|---|---|
| | దేవ మందిరము | స్నానాల గది | వంటశాల | |
| | ధనాగారము | అష్టభాగ నిర్మాణము | శయన మందిరము | |
| | పశు ధాన్యశాల | భోజనశాల | ఆయుధశాల | |

పశ్చిమము

## షోడశభాగ గృహ నిర్ణయము

శ్లో॥ స్నానస్య పాకశయశాస్త్ర భుజేశ్చ ధాన్య
భండార దైవత గృహాణిచ పూర్వతస్యుః॥

తన్మధ్యతస్తు మథనాజ్య పురీష విద్యా
భ్యాసాఖ్య రోదన రతౌషధ సర్వధామః॥

తూర్పున స్నాన స్థానము, ఆగ్నేయమున వంట స్థానము, దక్షిణమున శయన స్థానము, నైరుతిన ఆయుధ స్థానము, పశ్చిమమున భోజన స్థానము, వాయవ్యమున పశు, ధాన్య స్థానము, ఉత్తరమున ధనాగారము, ఈశాన్యమున దేవస్థానము, భవనములోగాని, భవనము వెలువల ఖాళీ ప్రదేశములోగాని నిర్మాణము చేసుకోవచ్చును.

## దిక్కు విదిక్కులలో సూక్ష్మ దిక్కు నిర్ణయము

తూర్పు - ఆగ్నేయముల మధ్య దధిమథన స్థానము, ఆగ్నేయము - దక్షిణముల మధ్య ఆజ్య తైలాది స్థానము, దక్షిణము - నైరుతుల మధ్య మల మూత్ర విసర్జన స్థానము, నైరుతి-పశ్చిమముల మధ్య విద్యాభ్యాస స్థానము, పశ్చిమ-వాయవ్యముల మధ్య రోదన స్థానము, వాయవ్య-ఉత్తరముల మధ్య సంభోగ స్థానము, ఉత్తర-ఈశాన్యముల మధ్య వైద్య స్థానము, ఈశాన్య - తూర్పుల మధ్య సూతికా స్థానము లేర్పరచుకొనవలెను. లేక ప్రధాన గృహము బయట ఖాళీ స్థలములలో ఏర్పరచుకోవచ్చును. ఈ క్రింది విధముగా ఉదహరించబడినది.

ఈశాన్యము — తూర్పు — ఆగ్నేయము

ఉత్తరము (ఎడమ) — దక్షిణము (కుడి)

| | | | | |
|---|---|---|---|---|
| దేవ | ప్రసూతి | స్నాన | దధి మథన | వంట |
| వైద్య | | | | ఆజ్య తైల |
| ధన ధాన్య | | | | శయన |
| సంభోగ | | | | మలమూత్ర విసర్జన |
| పశు ధాన్య | రోదన | భోజన | విద్యాభ్యాసం | ఆయుధ |

వాయవ్యము — పశ్చిమము — నైరుతి

## జంట గర్భ దోషము

శ్లో॥ ఏకభిత్తుము సంబద్ధం కారయే ద్వో గృహద్వయమ్ ।
యమతుల్యాం తధానామ భర్తృగే హవినాశనమ్॥

పై శ్లోకమునుబట్టి రెండు గర్భముల గృహము నిర్మించరాదు రెండుగర్భము గృహమునకు అర్ధము తెలుసుకోవలెను. కొంతమంది రెండు గర్భముల గృహమని రెండు గర్భముల డాబా లని చెప్పుచున్నారు. మరికొంతమంది ఒక గర్భం డా మరియొక గర్భము పెంకుటిల్లు కలిసిన గృహమని చెప్పుచున్నారు ఒక గోడ సరిహద్దుగా వుంచి, ఇరువురు కలసి ఇరువైపులా గర్భములు పెట్టి నిర్మించిన డాబా రెండు గర్భముల గృహమని మరికొందరు చెప్పుచున్నారు పై శ్లోకము ఇటువం గృహములకు వర్తించదు. ఒక గోడ లేక తనాబి కిరువైపుల నాలుగు గజముల గర్భము కట్టి, వాటిపైన దూలములు వేసి, దూలముల మీద కొమురులు వేసి ఏక క పెంకుటిల్లును రెండు గర్భముల ఇల్లందురు. పై వెన్ను బద్ధ, మధ్య ఉన్న గోడమీద లేక తనాబిమీదకు వచ్చినందున రెండు గర్భముల ఇల్లు అయినది ఇటువంటి ఇం తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలో నిర్మించుచున్నారు ఇట్లు నిర్మించిన కొ కాలములో స్త్రీ నాశనము జరుగుచున్నది. ఇటువంటి ఇల్లును పదునాలుగ అధ్యాయములో ఆరవ నెంబరు పటముగా ఉదహరించడమైనది పై శ్లోకమ ఇటువంటి ఇండ్లకు వర్తించునుగాని, పై చెప్పిన డాబాలకు వర్తించదు

శ్లో॥ వాస్తునియోవిస్తార : స ఏవోచ్ఛ్రాయనిశ్చ యశుభవః
శాలై కేమ గృహేష్వసి విస్తార ద్విగుణితం దైర్ఘ్యమే॥

ఇంటికి గర్భము ఎంత వెడల్పో అంత ఎత్తు గోడలు ఉండవలయును.

## వసారాలు లేక పంచల ప్రమాణములు

శ్లో॥ సావష్టభం పార్శ్వయోస్తు సర్వత్ర సుస్థితం భవేత్
విస్తార షోడశాంశస్తు చతుర్హ స్తయుతచ్ఛ్రయః॥

పార్శ్వముల యందు వసారాలు గల గృహము సుస్థితవు అనిపించుకొనును మరియు శాలయొక్క గర్భ పరిమాణము పదునారు అంశములతో గూడిన నాల్గు హస్తములు కలిగియుండవలయును.

శ్లో॥ తదంతర స్యాచ్ఛతురం ప్రమాణం ప్రభవేద్బుధః ।
ద్వాదశభాగేనూనంచ సమస్త్రాం ప్రవికల్పయేత్ ॥

గర్భ పరిమితి అయిన పిమ్మట సమస్త గృహములకు 12 అంశముల వసారా పరిమాణము ఉండవలయును. మరియు వసారాలు ఉచ్ఛ నీచములు కనిపెట్టి, నిర్మాణము చేయవలయును. అనగా, పశ్చిమ వసారా కంటే తూర్పు వసారా ఒక వీసం వెడల్పు, ఎత్తు తక్కువ వుండవలెను. దక్షిణవైపు వసారా కంటే ఉత్తరవైపు వసారా ఒక వీసం వెడల్పు, ఎత్తు తక్కువ వుండవలయును.

## గుంటలు మొదలగు వాటి విషయములు

శ్లో॥ వాయవ్య ద్యగ్ని కోణేషు ఖాతే న యది దోషభమ్ ।
పశు స్త్రీ రోగ నాశంచ శిల్ప కేరళ నిర్ణయమ్ ॥

గృహమునకు వాయవ్య దిక్కున, ఆగ్నేయ దిక్కున గుంటలు, గొయ్యిలు, నీరు పోవు మార్గములు మొదలగు నీచములు చేయరాదు. అనగా చాలా పల్లము ఉండరాదు. అలా చేసిరేని స్త్రీలకు, పశువులకు రోగముల సంభవించును.

## గృహాది శాలలకు వాటములు

శ్లో॥ పాంచాలవై దేహక కౌరవాఖ్యాంరాజన్యకం మాగధశూరసేనమ్।
తథాచగాంధారమవంతి కాఖ్యామిత్యష్టకంచైవ గృహప్రభేదమ్॥

పాంచాలము, వైదేహము, కౌరవము, రాజన్యము, మాగధము, శూరసేనము, గాంధారము, అవంతి అను ఎనిమిది రకముల వాటములు కలవు.

శ్లో॥ గృహ విస్తారకం సూత్రం చతుష్కృత్యా ప్రయత్నతః।
తత్రైకేన సమాయుజ్య మధ్యముద్ధృత్య యత్నతః॥
తదచ్ఛత్ర ప్రమాణేన ప్లవం పాంచాల ముచ్యతే ।
సార్ధద్వయాంగుళం తస్మా దేకైక మధికం కురు ॥
వైదేహి కైరవంచైవ రాజన్యం మాగధం తదాః
శూరశేనంచ గాంధారం ప్లవంచావంతికం తథాః
సర్వ మేకత్ర సంయుక్తం సార్థ సప్త దశాంగుళమ్।
ప్లవ ప్రమాణకం ప్రాహుః శౌనకో మునిపుంగవః ॥

గృహ విస్తారమును బట్టి గృహ కప్పు యొక్క ఎత్తును, వాటమును నిర్ణయించవలెను. గృహ విస్తార మనగా గర్భ గోడల వెలుపలి దూరము. కొన్ని గృహములకు గర్భ గోడల మీద దూలములు వేయుదురు. అప్పుడు దూలము యొక్క పొడవు గర్భ విస్తారముగా తీసుకొనవలయును. ఈ గర్భవిస్తారమునకు 1-1/4 రెట్లు పొడవుగల ఒక సూత్రమును (దారము లేక సన్నని త్రాడు) తీసుకొనవలయును. ఈ సూత్రము యొక్క చివరలు గర్భ గోడల వెలుపలకు (దూలములు వున్నచో దూలముల చివరకు) వుంచి సూత్రము యొక్క మధ్యభాగము ఒక కఱ్ఱతో పైకి ఎత్తవలయును. అట్లు ఎత్తిన గొడుగువలె వాటము వచ్చును. దీనినే పాంచాల వాట మందురు. ఆ సూత్రము మరియొక 2 1/2 అంగుళములు పొడిగించి మధ్య ఎత్తగా గొడుగాకారము వచ్చిన వైదేహి వాటమని, మరియొక 2 1/2 అంగుళములు పొడిగించి ఎత్తిన వచ్చు వాటము కౌరవ వాటమని, మరియొక 2 1/'2 అంగుళములు పొడిగించి ఎత్తిన రాజన్య మని, మరియొక 2 1/2 అంగుళములు పొడిగించి ఎత్తిన వచ్చు వాటము మాగధమని, మరియొక 2 1/2 అంగుళములు పొడిగించి ఎత్తిన వచ్చు శూరసేనమని, మరియొక 2 1/2 అంగుళములు పొడిగించి ఎత్తిన వచ్చు వాటము గాంధార మని, మరియొక 2 1/2 అంగుళములు పొడిగించి ఎత్తిన వచ్చు వాటము అవంతి వాటమని అందురు.

## వాటము కనుగొను విధము




1) పాంచాల, వైదేహ వాటములు రెండూ రైసు మిల్లులు, వర్కు షాపులు, సినిమా వగైరాలకు ఉపయోగపడును.

2) కౌరవ, రాజన్య వాటములు గృహములకు, పశుశాలలకు ఉపయోగపడును.

3) మాగధ, శూరసేన, అశ్వ, గజ శాలలకు ఉపయోగపడును.

4) గాంధార వాటము రథములకు, రథ శాలలకు ఉపయోగపడును.

5) అవంతి వాటము దేవాలయములకు ఉపయోగపడును.

## గృహాదులకు పనికివచ్చు దూలములు

శ్లో॥ *నీలి సాలంజి వికభ కదంబ ఖదిర స్తదా ।*
*మాలకం నక్త మాలంచ కుంభీచ ముష్కర స్తదా॥*
*వేణు రుద్ర గణంచైవ వెలమం చందనం తథా ।*
*వడిశం బిళ్ళవంచైవ తృణజానిస్తథా భవేత్ ॥*

నల్ల మద్ది, వేగిశ, కరప, చంద్ర, గానుగ, టేకు, మొక్కము, వెదురు, రుద్రగణము, వెలవెలము, చందనము, వడిశ, బిళ్ళుడు, తాడి మొదలగు దూలములు గృహములకు పనికివచ్చును.

## దూలముల యొక్క స్వరూపము

శ్లో॥ *మూలేచ శక్తి రూపస్యాత్ అగ్రస్యాచ్ఛంభురూపయోః॥*
*శంభు పూర్వోర్ధ్వ దృష్టేచ కర్త భర్త వినాశనమ్॥*

దూలము యొక్క మొదలు శక్తిరూపము, దూలము యొక్క చివర శంభు రూపము అగును. కాన, మొదలు దక్షిణ, పశ్చిమములు వేయవలెను. చివరలు తూర్పు, ఉత్తరముగా వేసి వసారాలు కొద్ది ఎత్తు తక్కువగా వేయవలెను. చివరలు తూర్పు ఉత్తరములుగా వేసి వసారాలు కొద్ది ఎత్తు తక్కువగా వేయవలెను. అలా చేయలేని గృహ యజమానికో లేక కట్టిన మేస్త్రీకో హాని సంభవించును.

## దూలముల యొక్క సంఖ్య

శ్లో॥ *గృహే కాష్ఠం సమం శ్రేష్ఠ మళిందం విషమే శుభమ్॥*

గృహమునకు దూలములు సమ సంఖ్యగా ఉండవలయును. అప్పుడు అళిందములు బేసి అగును. రెండు దూలముల సంఖ్య ఖాళీ అళిందమనీ, కాన అనీ, అర్ధనాటనీ, గది అనీ దేశీయ పదములు ఉన్నవి. దంతెలు బేసి సంఖ్యగా ఉండవలెను. దంతెలనగా డాబాకు వేయు కడ్డీలు.

## ఇందుకు ప్రమాణము

శ్లో॥ *యద్గృహం స్తంభ హీనేన వక్ర కంభంచ శూలకమ్।*
*విషదంతె నమం దూలం వెన్నుపోట్యశుభం భవేత్॥*

గృహము నిర్మించినప్పుడు ప్రక్క ఇంటి గోడయొక్క వాటు లేక పారు తప్పరాదు. అటులనే ఆ ఇంటియొక్క వెన్నుపోటు ఉండరాదు. డాబాలకు దంతులు లేక కడ్డీలు సమ సంఖ్యగా ఉండరాదు. దూలములు బేసి సంఖ్యగా ఉండరాదు. అట్లున్న అశుభములు కలుగును.

శ్లో॥ *వృక్షా దగ్ధ సకంటకాశ్చ ఫలిన స్త్యాజ్యా గృహేద్దూరతః॥*
*శస్తా చంపక పాటలేచ కదలీ జాజీ తథా కేతకః॥*
*యామాదూర్ధ్వ మశేష వృక్షసురజాఛాయాందశస్తాగృహే।*
*పార్శ్వైకస్య హరేరపీశపురతోచ్చానామ చండా క్వచిత్॥*

కాలిన వృక్షములు, ముండ్లుగల వృక్షములు; ఫలించని వృక్షములు ఇంటివద్ద ఉండరాదు. సూర్యోదయము తరువాత 7 1/2 ఘడియల వరకు, సూర్యాస్తమయమునకు 7 1/2 ఘడియల పూర్వము గృహముల మీద వృక్షముల యొక్క నీడ, దేవాలయాదుల నీడ వ్యాపించిన దోషము లేదు విష్ణ్వాలయమునకు వెనుక, శివాలయమునకు ముందు, శక్తి ఆలయమునకు నాలుగు దిశలయందు ఇండ్లు కట్టరాదు.

శ్లో॥ *స దగ్ధ వృక్షా ద్ద్రవిణస్య నాశం*
*కుర్యంతి తే కంటకినో రిభీతిః*
*ప్రజావినాశం అఫలాస్సమీపే*
*గృహేచ వర్జ్యాః కిల హీన పుష్పాః॥*

కాలిన వృక్షములు ధన నాశనమును, ముళ్ళుగల వృక్షములు శతృభయమును, ఫలించని వృక్షములు ప్రజా నాశనమును కలుగజేయును. పుష్పములు లేని వృక్షములు ఇండ్ల సమీపమున ఉండరాదు.

శ్లో॥ *దుష్టాభూత సమాశ్రితా విటపిన చ్ఛింద్యా యథాశక్తి తః*
*సంవాసంచ శమీ అశోక వకుళాపున్నాగ సచ్చంపకే,*
*ద్రాక్షా పుష్పక మంటపంచ తిలకాం కృష్ణాం వశేద్దాడిమీ*
*సౌమ్యాదేః శుభదౌ కపిత్థ సవటా వౌదుంబరాశ్వత్థకాః।*

దుష్ట వృక్షములను, పిశాచములుండు వృక్షములను సాధ్యమైనంతవరకు కొట్టి వేయవలెను. జమ్మి, అశోకము, పొగడ, పున్నాగము, చంపకము, ద్రాక్ష, పుష్ప తీగె, తిలక, దానిమ్మ, వెలగ, మర్రి, రావి మేడి మొదలగు వృక్షములు ఉత్తర దిక్కున ఉండవచ్చును.

శ్లో॥ *క్షీర వృక్ష వట్యాశ్వత్థ, రక్తపుష్ప ధృమాస్తథా ।*
*సకంటకా శాల్మలీచ ప్లక్షొదుంబర సంజ్ఞి కా ।*
*అగ్ని కోణే సదా దృష్టా మృత్యుపీడా ప్రదాయకాః ॥*

పాలు గల చెట్లు, మఱ్ఱి, రావి, ఎర్రని పువ్వులుగల చెట్లు, ముళ్ళుగల చెట్లు, బూరుగ చెట్లు, జువ్వి, మేడి మొదలగు చెట్లు ఆగ్నేయమున ఉన్న మృత్యు భయము కలుగును.

శ్లో॥ *పున్నాగ ఫలినీ నింబ దాడిమా శోక జాతికాః।*
*నాగకేసర సేపాని జపాకుసుమ కేసరమ్ ।*
జయంతి చందనం ప్రోక్తం వచాచైవ పరాజితా ః ।
*మధుబిల్వామ్ర భృంగాశ్చ నాగరంగ గుడాదికా ః ।*
*యత్రయత్ర స్థితాశ్చైతే నారికేళాదయ శ్శుభః॥*

సురపొన్న, ఫ్రేంకణపు చెట్టు, వేప చెట్టు, దానిమ్మ చెట్టు, అశోక వృక్షము, జాజిచెట్టు, నాగకేసర చెట్టు, చామంతి, దాసానిచెట్టు, పొగడ, మిగిలిన చెట్లు, వస, మంచి గంధపు చెట్లు, విష్ణుక్రాంతము, అతి మధురపు చెట్లు, మారేడు, మామిడి చెట్లు, లవంగ చెట్లు, కొబ్బరి, నారింజ, విప్పచెట్లు మొదలగునవి ఎచ్చట ఉన్నను దోషము లేదు

శ్లో॥ *దూలత్రయాది భవనం భయ రోగస్య జీవనమ్ ।*
*దూలమధ్యంచ గమనం దేహసౌఖ్య వినాశనమ్।*

మూడు దూలములు గల ఇల్లు భయమును, రోగమును కలుగ జేయును. దూలముల క్రింద సింహద్వారము ఉంచరాదు. దేహసౌఖ్యము నశించును. మూడు దూలములు గల ఇండ్లు నర్సారావుపేట తాలూకాలో చాలా ఉన్నవి.

శ్లో॥ *ఇష్టకా లోష్ట పాషాణ మృత్తికా జీర్ణ సోధనమ్ ।*
*తృణం పర్ణం బుధైర్ప్రోక్తం దారునూత్న గృహాయవై ॥*

పాత ఇండ్ల ఇటుకలు, మన్ను, రాళ్ళు, కట్లు, ఆకులు, గడ్డి, కొయ్యలు మొదలగునవి నూతన గృహములకు ఉపయోగించరాదు

శ్లో॥ *నూతనే నూతనం కాష్ఠం జీర్ణేజీర్ణం ప్రశస్యతే ।*

*జీర్ణేచ నూతనం కాష్ఠం నజీర్ణం నూతనే శుభమ్ ॥*

నూతనముగా నిర్మించే గృహములకు క్రొత్త దారువులను, పాత గృహములకు పాత దారువులను, కొత్త దారువులను వేయవచ్చును. క్రొత్త ఇండ్లకు పాత దారువులను వేయుట ధర్మము కాదు, ఏలయిన, ఒకడు నమిలి సారమును మ్రింగిన చెరకు పిప్పిని మరియొకడు నమిలిన సారము ఉండదు.

శ్లో॥ *గృహస్య దక్షిణే భాగే చక్రాకారస్య మందిరమ్ ।*

*స్థాపయత్సర్వసౌభాగ్య గృహదోషో న విద్యతె ॥*

గృహమునకు ఏ దోషముండినను దక్షిణ భాగమునందు చక్రాకార ఇల్లు నిర్మించిన యెడల సర్వదోషములు పోవుననిరి. కాని, అలా జరగదు. ఏలయన స్థంభశూల, ద్వారవేధ, ఘాతశూల, తరువేధ మొదలగు దోషములు ఉన్నప్పుడు వాట్లకు ఎదురుగా చక్రాకారము నిర్మించిన ఆ వేధ దోషములు పోయి, సౌఖ్యము, లాభము కలుగజేయును.

శ్లో॥ దేవాలయే మఠేచైవ అన్యగోత్రాన్న శాలయోః ।

నిషాద గేహ సత్రేషు స్తంభశూలో న విద్యతే ః

దేవాలయము, మఠము, అన్యుల గృహము, నిషాద గృహము, సత్రము మొదలగు వాటికి పారుల, నాట్ల, స్థంభశూలల దోషములేదు అని తాత్పర్యము.

# ఆరవ అధ్యాయము

## ద్వార ఖండము

## ద్వార సంఖ్యా నిర్ణయ ఫలము

శ్లో॥ *గవాక్ష ద్వార దారూణి సంఖ్యా నిర్ణయ వక్ష్యతే ।*
*పూర్ణానుస్వార సంఖ్యాచ సంఖ్యా విషమ వర్జయేత్ ।*
*సమసంఖ్యా శుభప్రోక్తం త్వష్టు వాక్యేన నిశ్చయః ॥*

కిటికీలు, ద్వారములు సున్న లేకుండా సమ సంఖ్యగా ఉండవలెను. అనగా 10,20,30 ఉండరాదు.

సమ సంఖ్యలు అనతగా 2,4,6,8 మొదలగు సంఖ్యలు ఉండవలెను.

బేసి సంఖ్యలు అనగా 1,3,5,7 మొదలగునవి ఉండరాదు.

బేసి సంఖ్య ఉన్నను, సమ సంఖ్యలో సున్న ఉన్నను అశుభము కలుగునని త్వష్టబ్రహ్మ నిర్ణయము కిటికీలు సమసంఖ్యగాను, ద్వారములు సమ సంఖ్యగాను, మొత్తము రెండు సంఖ్యలు కలుపగా సున్న లేకుండా యుండవలెను. గర్భమే కాక వసారాలతో సహా లెక్కించవలెను.

### సంఖ్యా ఫలములు

శ్లో॥ *గృహాది ద్వార మారభ్య ద్వియాంతం గృహ ముత్తమమ్ ।*
*గృహాది ద్వార తృతీయే శత్రువృద్ధికరం భవేత్ ।*
*దీర్ఘాయుఃష్యం చతుర్ద్వారం మృత్యురోగాది పంచకమ్ ।*
*షష్ఠమం పుత్రలాభంచ సప్తమం మృతకం భవేత్ ।*
*అష్టమం సర్వ సౌభాగ్యం నవమం గృహదాహకమ్ ॥*
*దశమం ద్వారశోభంచ స్త్రీ నాశం చోర బాధితమ్ ।*
*ఏకాదశం ధనక్షీణం ద్వాదశం దైత్య మర్దనమ్ ।*
*త్రయోదశీం మృతంశీఘ్రం సంపత్కరమ్ చతుర్దశీమ్ ।*
*పంచాదశీచేత్ మోక్షంచ షోదశం శుభదాయకమ్ ॥*

"గృహాది ద్వారమారభ్యా" అనుటచేత గర్భము, వసారాలతో సహా గృహమగు చున్నది. కాన, వసారాలు గర్భముతో సహా లెక్కచూచుకొనవలెను

2 ద్వారములు ఉత్తమము, 3 ద్వారములు శత్రువృద్ధి, 4 ద్వారములు దీర్ఘాయువు, 5 ద్వారములు మృత్యువు, 6 ద్వారములు పుత్రవృద్ధి, 7 ద్వారములు మృత్యువు, 8 ద్వారములు సర్వ సౌఖ్యము, 9 ద్వారములు అగ్ని భయము, 10 ద్వారములు శోభ, స్త్రీ రోగము, చోరభయము, 11 ద్వారములు ధననష్టము, 12 ద్వారములు శత్రు జయము, 13 ద్వారములు శీఘ్ర మరణము, 14 ద్వారములు సంపద, 15 ద్వారములు నిష్ఫలము, 16 ద్వారములు శుభదాయకము

ఈ విధముగా ఫలములు చూచుకొనవలెను

## పుర ద్వార లక్షణము

శ్లో॥ *సప్తహస్తం పురద్వారం విస్తారంతు యథోచ్ఛ్రితం ।*
*వేశ్మద్వారం పంచహస్తం షోడశాంగుళ వర్జితమ్ ॥*

పుర ద్వారము 7 గజములు పొడవు, దానికి తగినంత వెడల్పు వుండవలెను. ఇది కోట ద్వారమనబడును. గృహములకు ప్రాకార ద్వారము 5 గజముల పొడవు 4 గజముల 20 అంగుళములు ఉండవలెను.

శ్లో॥ *అశ్వారూఢే సమాయాతే తస్యో పరి తథోచ్ఛ్రయమ్ ।*
*హస్తమాత్ర ప్రమాణేన ద్వారం కుర్యా ద్విచక్షణ : ॥*

గుఱ్ఱము మీద వచ్చు పురుషునకు పైన ఒక గజము ఖాళీ ఉండునట్లు పొడవు పెట్టవలయును.

## గృహ ద్వార స్థాన నిర్ణయము

శ్లో॥ *కృత్వాదౌ నవధాన్య నిర్మిత గృహ క్షేత్రం నవ స్వేవ త*
*ద్భా గేష్వర్కముఖాన్ నవ ప్రతిదిశం సంస్థాప్య తత్సద్మసు ।*
*మర్త్యామర్త్యచతుష్పదాంక విగురుజ్ఞాం శేషుకుర్యాత్క్రమాత్*
*ద్వారాణీశ్వర వహ్ని రాక్షస మరుత్కోణాది రవ్యాదిషు ॥*

పడమటి గృహమునకు ఈశాన్యము మొదలు ఆగ్నేయము వరకు నవగ్రహముల స్థానములు ఏర్పరచి, బుధ స్థానమున పశుశాలకు, గురుస్థానమున దేవాలయాదులకు, శుక్రస్థానమున మనుజాలయములకు ద్వార నిర్ణయము చేయవలయును. బుధ, గురు, శుక్ర స్థానములు శుభస్థానములు కాన, ద్వారములు పెట్టవచ్చును. చంద్రస్థానము కూడా శుభస్థానమే గాన, ద్వారములు పెట్టవచ్చును.

ఇందులకు ఉదాహరణము

తూర్పు సింహద్వారము

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఉ | ర | చం | కు | బు | గు | శు | శ | రా | కే | ద |

పశ్చిమము

తూర్పు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఉ | కే | రా | శ | శు | గు | బు | కు | చం | ర | ద |

పశ్చిమము సింహద్వారము

తూ

ఉత్తర సింహద్వారము

| |
|---|
| కే |
| రా |
| శ |
| శు |
| గు |
| బు |
| కు |
| చం |
| ర |

దక్షిణము

తూ

ఉత్తరము

| |
|---|
| ర |
| చం |
| కు |
| బు |
| గు |
| శు |
| శ |
| రా |
| కే |

దక్షిణ సింహద్వారము

నాలుగు గృహములను పైన ఉదహరించిన ప్రకారము నవ భాగములు చేసి, రవి మొదలు కేతువు వరకు ఏర్పరచి, గురుస్థానము, శుక్రస్థానము, బుధస్థానములు సింహద్వారములు పెట్టి, ఉపద్వారము చంద్రస్థానములో పెట్టుకొనవచ్చును. తక్కిన భాగములు దుష్టగ్రహస్థానములు గాన, ద్వారములు పెట్టరాదు, ఆగ్నేయము మొదలు నైబుతి వరకు ఉత్తర గృహమునకు నైబుతి మొదలు వాయవ్యము వరకు తూర్పు గృహమునకు, వాయవ్యము మొదలు ఈశాన్యము వరకు దక్షిణ గృహమునకు నవ గ్రహములు పంచి, శుభస్థానములలో ద్వారములు పెట్టుటవలన చాలా శుభములు కలుగును.

## నవగ్రహ స్థాన ఫలములు

| | |
|---|---|
| 1. రవి స్థానము | అగ్నిభయము |
| 2. చంద్రస్థానము | సౌఖ్యము |
| 3. కుజస్థానము | కలహము |
| 4. బుధస్థానము | పశులాభము |
| 5. గురుస్థానము | ధన పుత్రలాభము |
| 6. శుక్రస్థానము | ధన ధాన్యలాభము |
| 7. శని స్థానము | ఆయుక్షీణము |
| 8. రాహు స్థానము | దొంగల భయము |
| 9. కేతు స్థానము | భూత భయము |

ఆయా స్థానములు ఆయా ఫలములు కలుగజేయును

శ్లో॥ *ఉచ్ఛ్రయం నవభాగాస్యా ద్విస్తారం పంచభాగతః ।*

*ద్వారాణామపి సర్వేషాం ద్వారబంధ ప్రమాణతః ॥*

ద్వారము లోపలి కొలత తొమ్మిది భాగముల పొడవు, అయిదు భాగముల వెడల్పు వుండవలయును. ఈ భాగముల ప్రకారము ఆయములు కట్టి, సింహద్వారాలకు గణితము వ్రాయడమైనది.

65"× 35"; సింహాయము

65"× 37"; ధ్వజాయము

67"× 35"; ధ్వజాయము

67"× 37"; గజాయము

69"× 37"; ధ్వజాయము

69"× 39"; సింహాయము

71"× 39", ధ్వజాయము

71"× 41"; గజాయము

73"× 41"; ధ్వజాయము

73"× 43"; సింహాయము.




ఈ కొలతలు ద్వారముల యొక్క లోపలి కొలతలుగా ఉండవలయును. ఈ తొమ్మిది భాగముల పొడవు, అయిదు భాగముల వెడల్పు ఒక అంగుళం హెచ్చు తగ్గులలో సరిపోవుచున్నది.

శ్లో॥ *అత్యుచ్ఛ్రంచే చ్చోరభయం అతిహీనే క్షుదా భయమ్ ।*

*చతుష్షష్ట్యంగుళోత్సేధం చతుస్త్రింశంచ విస్తరమ్ ॥*

ద్వారము దీర్ఘమైనదిగా ఉన్న చోరభయము కలుగును. అతి కురచగా ఉన్న ఆకలి బాధ, దరిద్రము ఉండును. కాన సింహద్వారము కాక మిగిలిన ద్వారములు 64" పొడవు, 34" వెడల్పు లోపలి కొలత ఉన్న శుభములు కలుగును.

శ్లో॥ *సరళేనచ మార్గేణ ప్రవేశో యత్ర వేశ్మని।*

*మార్గవేధం విజానీయా న్నానాశోక ఫలప్రదమ్॥*

ఏ గృహమునకయినను సరళమైన మార్గమున ప్రవేశము కలుగునట్లు చేయవలయును అనగా అడ్డదిడ్డములు లేకుండా ప్రవేశమునకు వీలు కలుగునట్లుగా చేయవలయును లేనియెడల నానా విధములైన కష్ట నష్టములు కలుగును

## ద్వార వేధ లక్షణము, వాటి ఫలములు

శ్లో॥ *రథ్యా విద్ధం ద్వారం నాశో కుమార దోష తరుజమ్।*

*పంకద్వారో శోకో వ్యయో అంబుధి ర్నారధ ప్రోక్తః ॥*

వీధికి ఎదురుగా సింహద్వార ముండిన యజమానికి నాశనము. వృక్షమునకు ఎదురుగా ద్వారముండిన పుత్ర నాశనము. ఎదుటి ఇంటి గోడమూలకు ఎదురుగా ద్వారము ఉండిన దుఃఖము కలుగును జల ప్రవాహమునకు ఎదురుగా ద్వారము ఉండిన ధనక్షయము కలుగును.

శ్లో॥ కూపేనాపస్మారో భవతి వినాశశ్చ దేవతాఽభిముఖే ।
స్త్రీదోషః స్థంభముఖే కులనాశో బ్రాహ్మణాభిముఖే ఏవమ్॥

ద్వారమునకు ఎదురుగా బావియుండిన అపస్మార రోగము. దేవాలయమున్న వినాశనము, స్థంభమున్న స్త్రీనాశనము, బ్రాహ్మణ గృహమున్న కుల నాశనము కలుగును.

శ్లో॥ తరువేధం విజానీయా ద్యది ద్వార ముఖేస్థితమ్।
కుమార మరణం జ్ఞేయం నానారోగశ్చ జాయతే॥

ద్వారము యొక్క ముఖము నందు దూలమున్న తరువేధ అనబడును. అట్లు తరువేద గల ద్వారము పుత్రులకు మరణము కలుగజేయును మరియు నానావిధరోగములు కలుగజేయును.

శ్లో॥ జలస్రావ స్తథా ద్వారే మూరే నర్థచయో భవేత్ ।
ద్వారాగ్రే దేవసదనం బాలానా మూర్తిహాయకమ్ ॥

ద్వారము అడుగు భాగమున నీరుపోవు మార్గము ఉండిన అనర్థకములు కలుగును. ద్వార అగ్రస్థానమున దేవ సదనము ఉండిన బాలురకు రోగములు కలుగజేయును.

శ్లో॥ ఉత్తరం పంచమం ద్వారం బ్రహ్మణో విద్ధ ముచ్యతే ।
తస్మాత్తస్య శిరా హ్యేవ మధేచైవ విశేషతః।
ద్వారాన్న కారయేద్ధీమాన్ ప్రాసాదేతు విపర్యయః।
దేవతా సన్నిధానేతు శ్మశానాభిముఖే తథా।
స్త్రీనాశం సంభవేధే స్యాత్పాషాణేచ తథైవచ ।
దేవతా సన్నిధానాస్థే గృహే గృహపతే క్షయః ।
శ్మశానాభిముఖే గేహే రాక్షసా ద్భయామాదిశేత్॥

ఉత్తర దిక్కునందు పంచమద్వార ముండెనేని బ్రహ్మవిద్ధ మనబడును. గృహ మధ్యమందు ద్వారము పెట్టరాదు. ప్రాసాదమునందు విపర్యయంగా అనగా

విపులముగా చేయువలయును. మరియు దేవతా సన్నిధానమునందును, శ్మశానాభిముఖము నందును ద్వారము పెట్టరాదు. ద్వారము పెట్టినేని స్త్రీ నాశనం తప్పక కలుగును దేవతా ముఖద్వారమునకు గృహద్వారముండెరేని గృహపతి నాశనము, శ్మశానమున కభిముఖముగా ద్వారముండెనేని ఆ గృహమునందు రాక్షస బాధలు సంభవించును.

శ్లో॥ *ఏకోదిశే బహిర్ద్వారం మహదైశ్వర్యకారణమ్ ।*
*ద్వారద్వయం భోగవృద్ధిః ద్వారత్రయ మశోభగమ్।*
*దుఃఖదం రోగదంచైవ దారా పుత్ర వినాశనమ్।*
*బహుళద్వార నిచయం దోషకృద్వ్యగ్రభాగతః।*
*గృహంతే ద్వార నిచయం సక్షయా సమయాన్కృతమ్।*
*షోడశ ద్వార పర్యంతం శుభా శుభ ఫలం విదుః॥*

గృహమునకు ఒక దిశయందు వెలుపలకు వచ్చు ద్వారము ఒకటి యుండిన ఐశ్వర్యవృద్ధి, రెండు ఉన్న భోగవృద్ధి, మూడు వున్న అశుభములు కలుగును. అయిదు ద్వారములు ఉన్న దుఃఖము కలుగును. ఏడు ద్వారములు ఉన్న రోగ భయము కలుగును. తొమ్మిది ద్వారములు ఉన్న దారాపుత్ర నష్టము కలుగును. ఈ విధముగా పదహారు ద్వారముల శుభాశుభములు చూచుకొనవలెను. ప్రతీ దిశకు ఈ ప్రకారము చూచుకొనవలయును.

## ద్వార స్థాపన

శ్లో ॥ *కృత్తికాద్యం సప్తపూర్వే మఘాద్యం సప్త దక్షిణే।*
*మైత్రాద్యం పశ్చిమే జ్ఞేయం ధనిష్ఠాత్ సప్త ఉత్తరే*
*యద్దిశస్సంస్థితే చంద్రః తద్దిగ్ద్వారం ప్రశస్యతే॥*

కృత్తకాదిగా 7 నక్షత్రములు తూర్పు దిక్కునందును, మాఘాది 7 నక్షత్రములు దక్షిణమునందును, అనూరాధాది 7 నక్షత్రములు పశ్చిమమునందును, ధనిష్ఠాది 7 నక్షత్రములు ఉత్తర దిక్కునందును ఉండును. ఏ దిక్కునందలి నక్షత్రమున చంద్రుడు ఉండునో, ఆ దిక్కున ద్వారము పెట్టుట ఉత్తమము.

శ్లో॥ ***ఉన్మాదోద్ఘటితే ద్వార పిహితేస్యాద్ధినిశ్చయః।***
***విధాయచే దుర్ఘటే ద్వ్యే కులనాశో భ వే దలమ్॥***

తెరువబడిన తలుపులు వాటి కవి మూయబడిన యజమానికి మతిచాంచల్యం కలుగును. మూయబడిన తలుపులు వాటి కవి తెరువబడిన కుల నాశనము కలుగును.

శ్లో॥ *పీడాకర మతిపీడితం అంత రవనతం భవేదభావాయ।*

*బాహ్యేऽవనతే ప్రవాసో ద్విగ్ధ్వాంతే దస్యుభిః పీడా॥*

మిక్కిలి కష్టతరముగా తలుపు పడిన పీడయు, లోపలకు వంగిపడిన సర్వ వస్తు నాశనము, వెలుపలకు వంగిపడిన పరదేశ నివాసము కలుగును. తలుపులు ధ్వని చేసినచో చోర భయము కలుగును.

# శాలా ధృవాధ్యాయము

## ద్వార సంఖ్యా గృహనామ ఫలములు

శ్లో॥ *దిక్షు పూర్వాదితశ్శా లాధృవా భూ 1. దౌ 2, కృతా 4, గజా 8.*

*శాలా ధృవాంక సంయోగ స్సై కేవేశ్మ ధృవాధికమ్॥*

తూర్పు దిక్కు మొదలు 4 దిక్కులకు క్రమముగా శాలా ధృవాంకములు 1, 2, 4., 8 సంఖ్యలుగా చెప్పబడినవి. కాన శాలా ధృవాంకమునకు ఒకటి కలిపిన యెడల గృహధృవమని చెప్పబడెను.

### ఉదాహరణము

తూర్పు దిక్కునకు 1, పశ్చిమ దిక్కునకు 4 న్నూ, ఈ రెండు సంఖ్యల మొత్తం 5 న్నూ, ధృవకము 1 కలుపగా 6 అయినది. అనగా తూర్పు దిక్కున ఒక ద్వారమును, పశ్చిమ దిక్కున ఒక ద్వారమును పెట్టిన పై సంఖ్యలు 6 వచ్చునవి కాన, కాంత గృహమనబడును. ఈ మోస్తరుగానే గృహమునకు తూర్పు, దక్షిణ, ఉత్తరములు ద్వారములు పెట్టవలసినప్పుడు, తూర్పు 1, దక్షిణము 2, ఉత్తరము 8, ఈ మొత్తము కలుపగా 11 సంఖ్య వచ్చినది. వీటితో 1 కలుపగా 12 వచ్చినది ఈ సంఖ్యను గృహ ధృవాంకమనబడును. అప్పుడు ఈ గృహము ధనాఖ్య గృహమగును. ఈ విధముగానే 4 దిక్కులకు ద్వారములు పెట్టిన యెడల విజయాఖ్య గృహమనబడును.

# శాలా ధృవ గృహ నామములు

శ్లో॥ *ధృవంచ ధాన్యంచ జయంచ నందమ్।*
*కరంచ కాంతంచ మనోరమంచ।*
*సువక్ర సౌజ్ఞం ఖలు దుర్ముఖాఖ్యమ్।*
*క్రూరం విపక్షం ధనదం క్షయంచ*

*ఆక్రంద సంజ్ఞం విపులాహ్వాయంచ।*

*స్యాత్షోడశం త ద్విజయాభిధానమ్॥*

ధృవ గృహము, ధాన్యగృహము, జయగృహము, నందగృహము, ఖరగృహము, కాంతగృహము, మనోరమగృహము, సువక్రగృహము, దుర్ముఖగృహము, క్రూరగృహము, రిపుగృహము, ధనదగృహము, క్షయగృహము, ఆక్రందగృహము, విపులగృహము, విజయగృహము.

శ్లో॥ *ధృవసంజ్ఞ గృహంత్వాద్యం ధనధాన్య సుఖప్రదమ్।*
*ధాన్యం ధాన్యప్రదం నృణాం జయంస్యా ద్విజయప్రదమ్*
*నందం స్త్రీహానిదం న్యూనం ఖరం సంపద్వినాశనమ్।*
*పుత్ర పౌత్రప్రదం కాంతం శ్రీపదంస్యాత్ మనోరమమ్।*
*సువక్రం భోగదం న్యూనం దుర్ముఖం విముఖప్రదమ్*
*సర్వ దుఃఖప్రదం క్రూరం విపులం శత్రుభీతిదమ్*
*ధనదం ధనదం గేహం క్షయ స్సర్వ క్షయావహమ్*
*ఆక్రందం శోక జనకం విపులం శ్రీ యశఃప్రదమ్।*
*విపులం నామ సదృశం ధనదం విజయాభిదమ్॥*

## అర్థము-వివరణ




ద్వారహీనము (ధృవ గృహము)
ధన ధాన్య లాభము చేయును.




తూర్పు ద్వారము (ధాన్య గృహము)
ధాన్యలాభము చేయును.



దక్షిణ ద్వారము (జయగృహము)
జయప్రదమైనది

తూ



తూర్పు, దక్షిణ ద్వారములు
(నంద గృహము)
స్త్రీ రోగము చేయును.



పశ్చిమ ద్వారము (ఖరగృహము)
సంపద నశించును



తూర్పు, పశ్చిమ ద్వారములు
(కాంతగృహము)
పుత్రపౌత్రాభివృద్ధి

ఉ  ద

దక్షిణ, పశ్చిమ ద్వారములు
(మనోరమ గృహము)
సంపద కలుగును



తూర్పు, దక్షిణ, పశ్చిమ ద్వారములు
(సువక్త్ర గృహము)
భోగము తగ్గును.



ఉత్తర ద్వారము (దుర్ముఖ గృహము)
సిరిసంపదల నష్టము



ప

తూర్పు, ఉత్తర ద్వారములు
(క్రూర గృహము)
సర్వ దుఃఖములు కలుగును.




దక్షిణ, ఉత్తర ద్వారములు

(రిపు గృహము)

శత్రు భయము కలుగును.



తూర్పు, దక్షిణ, ఉత్తర ద్వారములు

(ధనద గృహము)

ధనవృద్ధి కలుగజేయును.



పశ్చిమ, ఉత్తర ద్వారములు

(క్షయ గృహము)

సర్వ క్షయము కలుగజేయును.




తూర్పు, పశ్చిమ, ఉత్తర ద్వారములు

(ఆక్రంద గృమము)

రోగ, శోకములు కలుగజేయును.



దక్షిణ, పశ్చిమ, ఉత్తర ద్వారములు

(విపుల గృహము)

కీర్తి, సంపద కలుగజేయును.




నాల్గు దిశల ద్వారములు

(విజయ గృహము)

సర్వసిద్ధి, ధనము కలుగజేయును.

## ద్వార విన్యాసములు

సూ॥ అహైశాన్యాదికోణేషు గృహస్య బాహ్యతః ఏతాని
వసంతి। ఈశాన్యే చరకో, అగ్నికోణే విదారి, నైరు
త్యాం పూతనా, వాయవ్యే రాక్షసి। తస్మా
ద్గ్రామ పుర భవన కోణేషు వాసో న శుభదః కిమ్॥

ఈశాన్య కోణమందు గృహమునకు వెలుపల ద్వారము పెట్టిరేని చరకమనియు, ఆగ్నేయ కోణమందు ద్వారము పెట్టిరేని విదారి యనియు, నైరుతి కోణమందు ద్వారము పెట్టిరేని పూతన యనియు, వాయవ్య కోణమందు ద్వారము పెట్టిరేని రాక్షసి యనియు చెప్పబడెను. కావున పుర, గ్రామ, గృహ, భవనములకు పై కోణముల యందు ద్వారములు పెట్టరాదు.

## తలుపుల లక్షణములు

శ్లో॥ ఏకఖండే భవేద్రాజ్యం చతుష్కండంచ నిర్ధనమ్।
పంచఖండే మహైశ్వర్యం ద్విఖండే విత్తనాశనమ్।
త్రిఖండే పుత్రవ్యధితం ఇత్యేతే ద్వార లక్షణమ్॥

ఒక బల్లతో తలుపులు చేసిన రాజ్య లాభము. రెండు బల్లలతో చేసిన ధన నాశనము. మూడు బల్లలతో చేసిన పుత్ర వంచనము జరుగును. నాలుగు బల్లలతో చేసిన ధన నాశనము. ఐదు బల్లలతో చేసిన ఐశ్వర్యము కలుగును.

## ద్వారముల స్థానములు

శ్లో॥ భిత్తి ద్వాదశ భాగచం, అంతరం సప్తభాగకమ్।
పంచమం బాహ్య దిగ్భాగ మిత్యేతే ద్వార లక్షణమ్।

భిత్తిని లేక గోడమందమును పదిరెండు భాగములుగ విభజించి లోపల ఏడు భాగములు ఉండునట్లును, వెలుపల ఐదు భాగములు ఉండునట్లును చూసి సమస్త ద్వారములు వుంచవలయును.

## మహా ద్వార నిర్ణయము

శ్లో॥ ప్రధానం యన్మహాద్వారం బాహ్యాభిత్తిషు సంస్థితః।
రథ్యా విద్ధం న కర్తవ్యం న కుర్యాత్ భూతి మిచ్ఛతా॥

ప్రహరీ గోడ లేక కోట గోడల యొక్క ప్రధానమైన ద్వారము వీధి ఎదుట పెట్టరాదు. అట్లుచేసిన నానావిధ కష్టములు కలుగును.

మరియు ప్రహరీగోడ నాటు దాటి వెలుపలకు దిమ్మలు కట్టి గేటు తలుపులు పెట్టరాదు.

# ఏడవ అధ్యాయము

## వాపి, కూప, తటాకాదులు

శ్లో॥ ద్వార హీనో భవే త్కూపో ద్వారేణై కేన వాపి వా
నైకద్వార పుష్కరిణీ దీర్ఘకారాతు దీర్ఘి కా।
కుల్యాదిదూత తోయాశ్చ తటాకా పరికీర్తితాః॥

ద్వారహీనము - మార్గము లేనిది బావి లేక కూపమనియు, ఒక మార్గము గలది వాపి లేక దిగుడు బావి అనియు, నాలుగు ప్రక్కల మార్గము గలది అనగా నాలుగు వైపులను సమానమైన పై భాగములు మొదలు నీటి వరకు మెట్లు గలది పుష్కరిణి అనియు, వెడల్పు కంటే రెండు రెట్లు పొడవు గలది దీర్ఘిక అనియు, కాలువచేత నీళ్ళు నింపునది, పోవునది తటాకమనియు, సస్యములు పండించెడి పొలములకు నీరు ఇచ్చునది చెఱువనియు తెలుసుకొనవలెను.

శ్లో॥ వాపీ కూపోర్మధ్య దేశేఽర్థహానిః ఐశానాదౌ
పుష్టి, ఐశ్వర్యవృద్ధిః, సూనోర్నాశః, స్త్రీవినాశో,
మృతిశ్చ, సంపదా, శస్త్రశత్రుపీడా, సౌఖ్యం వాపోద్భహస్య।
మధ్యమార్గే, మధ్యదేశే వాపీ జలకూపే సతి
స్వామినో గృహపతే రర్థనాశస్యాత్॥

శ్లో॥ ఐశాన్యాం కూప పుష్టిః, పూర్వాస్యా మైశ్వర్యమ్
ఆగ్నేయ్యాం పుత్రనాశః, దక్షిణస్యాం స్త్రీవినాశః,
నైఋుత్యాం నిధనం, పశ్చిమాయాం సమ్యక్
వాయవ్యాం శత్రు శస్త్రపీడాంచ
ఉత్తరస్యాం సుఖః గృహస్వామిన ఇతి తథా॥

పై రెండు శ్లోకములు మయ. సనత్కుమార మతములు.

క్షేత్ర గృహమధ్య భాగమున బావి త్రవ్విన ధనహాని, ఈశాన్యము నందు పుష్టి, తూర్పు దిక్కున ఐశ్వర్యము, ఆగ్నేయమున పుత్రహాని, దక్షిణమున స్త్రీ నాశనము, నైరుతి దిక్కున మృతి, పశ్చిమమున సంపద, వాయవ్యమున శత్రుపీడ, ఉత్తరమున సౌఖ్యము, మార్గ మధ్యమమున గృహపతికి అర్థనాశనము కలుగును. ద్వారమార్గ కూపదోషములకు ద్వార వేధ లక్షణములు చూచుకొనవలెను.

శ్లో॥ ఆగ్నేయాది త్రికోణేషు న కుర్యా త్కూపకం బుధః।
శేష స్థానేషు శుభదం గ్రామాదీనా మిదం స్మృతమ్॥

ఆగ్నేయ, నైరుతి, వాయవ్య మొదలగు మూడు దిక్కులు వదలి ఈశాన్య దిక్కున బావి త్రవ్విన గ్రామమునకు, గృహమునకు శుభము కలుగుననిరి

సూ॥ పాచ్యాదిదిక్షు స్వవిలే సుతహాని శ్శిఖిభయం రిపుభయమ్।
స్త్రీ కలహం స్త్రీదౌష్ట్యం నైష్యుంచింతాత్మజవివృద్ధిః॥

తూర్పు దిక్కు మొదలు ఏడు దిక్కులు దోషములే గావున ఈశాన్య దిక్కు మాత్రమే శుభమని లల్లభట్టు డంగీకరించెను. ఇందుకు కారణములు ఉన్నవి.

"గృహస్థంభే కూపమధ్యే" ప్రమాణమును బట్టి గృహము యొక్క గోడ, దూలము మొదలగువాటికి ఎదురుగా బావి త్రవ్వరాదు. కూపస్థంభవేధ, గృహ భిత్తివేధ మొదలగు దోషములు గలుగును. ఒక్క ఈశాన్య దిక్కున మాత్రమే బావి త్రవ్విన ఉత్తమమని "మయబ్రహ్మ" అంగీకరించెను.

శ్లో॥ ప్రాగీశాన్యే కుబేరదేశే వాపీకూపతటాక ఖననే।
దేవానాం నరగేహానాం సర్వకాల శుభప్రదమ్॥

శాస్త్రానుభవరీత్యా పై శ్లోకము సరిపోవుచున్నది.

వైష్ణవాలయమునకు కుబేరస్థానమందు వాపి, కూప, జలనాడి, తటాక, నదులు ఉండును. ఇందుకు తార్కాణం : తిరుపతి దేవాలయమునకు ఉత్తర దిశలో తటాకమున్నది. కావుననే విశేష ధనసంపద కలిగియుండెను. సింహాచల దేవాలయమునకు ఉత్తరమున జలనాడులు, నెల్లూరు శ్రీరంగనాయకుల దేవస్థానమునకు ఉత్తరమున పెన్నానది యున్నది. ఈ విధముగా విష్ణ్వాలయములకు ఉత్తరమున వాపి, కూపాదులుండును. శివాలయములకు ఇంద్రస్థానమున వాపీ, కూపతటాకాదులుండును. జనసంపద, సిరిసంపదగలిగి యుండును. ఇందుకు తార్కాణము; శ్రీశైల పర్వత దేవాలయమునకు తూర్పున పాతాళగంగ, కాశీ దేవాలయమునకు తూర్పున గంగానది ఉన్నది. శక్తి ఆలయములకు పశ్చిమమున వాపీ. కూప. తటాకాదులు ఉండును. ఇందుకు సాదృశ్యము : కంచి కామాక్షి ఆలయమునకు పశ్చిమమున తటాకము, విజయవాడ కనకదుర్గ పర్వతమునకు పశ్చిమమున కృష్ణానది. తిరుపతి అలిమేలు మంగతాయారమ్మ గుడికి పశ్చిమమున పుష్కరిణీ ఉన్నది. ఈ విధముగా శక్తి ఆలయ క్షేత్రములకు వాపి, కూప, తటాకాదులు

పశ్చిమమున ఉండును అందుచేతనే దేవతా స్త్రీలకు శక్తిత్వము గలుగుచున్నది. మానవ స్త్రీలు శక్తిని భరించజాలరు గనుక అనారోగ్యము, మారక భయము కలుగును అందువలన గృహమునకు నీచస్థానము, గుంటలు, గొయ్యిలు మొదలగునవి ఉండరాదు. క్షేత్రపరీక్షాఖండములో ఉదహరించడమైనది.

శ్లో॥ *కూపమధ్య గృహస్థంభే కర్త భార్యా పశుక్షయః।*
*అన్యక్షేత్ర కూపఖననే మధ్యస్థంభేన దోషభాక్॥*

బావి మధ్యకు తన గృహము యొక్క గోడగాని, స్థంభముగాని, దూలముగాని ఉండరాదు కూప, స్థంభ, భిత్తి వేధలు గలుగును. కావున తూర్పు, ఈశాన్య, ఉత్తర దిక్కుల యందు సూక్ష్మదృష్టితో ఆలోచించి బావి త్రవ్వవలెను.

## పుష్పవాటిక నిర్మాణము

శ్లో॥ *వామే భాగే దక్షిణేవా నృపాణాం*
*త్రేధా కార్యావాటికా క్రీడనార్థమ్।*
*ఏక ద్విత్రిర్దండ సంఖ్యా శతం స్యా*
*న్మధ్యేధారా మండపం తోయ యంత్రైః।*
*క్షేత్రం సప్త విభాగభాజితమతో భద్రం భాగత్రయమ్।*
*తన్మధ్యే జల వాపికాజితపదై రేకాంశతో వేదికా।*
*స్థంభేర్వా దశభిశ్చ మధ్య చరితః కోణేషు కూపాన్వితః।*
*కర్తవ్యో జలయంత్ర ఏష విధవ ద్భోగాయ భూమీభుజామ్*
*తస్యాం చంపక కుంద జాతి సుమనో వేశాశ్చ నిర్వాళికా*
*జాతీ హేమ సమాన కేతకి రపి శ్వేతా తథా పాటలా।*
*నారంగః కరణీ వసంత తిలకా చారక్త పుష్పాదికమ్*
*జంబీరో బదరీచ పూగ మధుపా జంబూశ్చ చూతద్రుమాః।*
*మాలూరః కదలీచ చందన వటా వశ్వత్థ పద్మాశిరా*
*చించాశోక కదంబ నింబ తరవః ఖర్జూరికా దాడిమీం।*
*కర్పూరాగరు కింశుకా హదరింపుః పున్నాగ సం నింబకీ।*
*ప్రోక్తా నాగ లతాచ బీజ నిభృతా న్యాత్తిందు కీలాంగలీ।*
*ద్రాక్షైలా శతపత్రికాచ వకులా దత్తూర కంకోలకా*

మాలాస్తాల తమాలకౌ మునివరో మందార పారిద్రుమౌ,
అన్యే భోగ్య విచిత్ర ఖాట్యే సకలా సైరోపణీ యా బుధైః
య్యాన్రాప్నోతిచభూతలేశుభతరూన్త చ్పంపకాన్యాపయేత్
ఆస్థానాంపతి సేవనా యచ ఘటీ యంత్రః సుసారాభవే
ధోల్రాస్త్రీ జన ఖేలనాయ రుచిరేర్ వర్షావసంతోత్సవే,
బాలా ప్రౌఢ వధూ సుమధ్య వనితా గానైర్మనో వారిభి
గ్రీష్మేశాందనకేద శీతల జల క్రీడా శుభౌ మండపే॥

అందము, వినోదము కొరకు పల్లముగా (భూమి లోపల నుంచి) గృహ ఉత్తర భాగమున, మెరకగా (భూమిపై) దక్షిణ భాగమున పుష్పవాటికలు మూడు విధములుగా నిర్మించవచ్చును.

1) దీర్ఘముగను, 2) వృత్తాకారముగను, 3) చతురస్రముగను నిర్మించవచ్చును.

## పుష్పవాటిక వైశాల్యము

100 దండములుగాని, గజములుగాని, అడుగులుగాని, అంగుళములుగాని ఉండవలెను.

మధ్య నీరు పైకి చిమ్మే గొట్టము అమర్చి, యంత్ర సహాయముచే నీరు పైకి పంపిన అందముగ నుండి, దీని చుట్టూ ఉన్న పుష్ప మొక్కలకు నీరు ఇచ్చును. అచ్చట అనేక విధములైన పుష్పజాతులు ఉంచవలెను.

చాలామంది గృహావరణములో పుష్ప, ఫల వృక్షములను వేయుచున్నారు. అట్లు వేయుటవల్ల అందంగా నుండుటయేగాక, గాలి సౌఖ్యము, మానసిక సౌఖ్యము గలుగును. ఈ పుష్పవాటిక దిశనుబట్టి ఉచ్చ, నీచములు కనిపెట్టి ఏర్పరచవలెను.

## దిక్సాధనము

శ్లో॥ గ్రామస్థాపన క్షేత్రకోష్ఠ పురయో ఙ్ఞే యం తథా వక్ష్యతే
క్షేత్రాణాం నవ భాగికం కృత దిశౌ యీశానర్యవ్యాదిషుః
భాగే మధ్యమ పంచభాగ దిశతత్ పార్శ్వద్వయంకోణయోః
కూపారామ తటాక దేవ నిలయే సంస్థాప్య శోభస్కరమ్
ఇత్యేవం మయబ్రహ్మణ కృత దిశౌ గ్రామ గృహారంభకె

మయునిచే చెప్పబడిన శాస్త్రప్రమాణమును బట్టి క్షేత్రమునకు తూర్పును 9 భాగములు చేసి, ఈశాన్యమున 2 భాగములు, ఆగ్నేయమున 2 భాగములు విడువగా మధ్య 5 భాగములు తూర్పు దిశ అగును.

దక్షిణమును 9 భాగములు చేసి, ఆగ్నేయమున 2 భాగములు, నైరుతిని 2 భాగములు విడువగా మధ్య 5 భాగములు దక్షిణ దిశ అగును.

పశ్చిమమును 9 భాగములు చేసి, వాయవ్యమున 2 భాగములు, ఈశాన్యమున 2 భాగములు విడువగా మధ్య 5 భాగములు ఉత్తర మగును.

ఉత్తరమును 9 భాగములు చేసి, వాయవ్యమున 2 భాగములు, ఈశాన్యమున 2 భాగములు విడువగా మధ్య 5 భాగములు ఉత్తర మగును.

ఈ విధముగా తీర్చిన మధ్య 5 భాగములు దిక్కులు, కోణములయందలి 4 భాగములు విదిక్కులు ఏర్పడుచున్నవి ఈ విధముగా గ్రామ, నిలయ, దేవాలయ యంత్రశాలాదులు నిర్మాణము చేయునప్పుడు దిశ, విదిశలు ఏర్పరచుకోవలెను.

## దిక్కు నిర్ణయ ప్రచారము

ఈశాన్యము తూర్పు ఆగ్నేయము

ఉత్తరము




దక్షిణము

వాయవ్యము పశ్చిమము నైరుతి

శ్లో॥ ప్రాసాదే సదనేళిందే ద్వారకుండే విశేషతః।

దిఙ్మూఢే కులనాశస్స్యాత్తస్మాత్సంసాధయే ద్దిశః॥

గ్రామము గృహక్షేత్రము పూర్తిగా దిక్కునకు లేక విదిక్కునకు ఉండిన మంచిది. అట్లు దిక్కునకు, విదిక్కునకు లేనిచో దిఙ్మూఢ మనబడును కనుక దిఙ్మూఢమగు స్థలముకు తూర్పు దిక్సాధన చేసి ప్రాకారములు, భవనములు, ద్వారములు, కోటలు, విద్యాలయములు, యంత్రశాలలు మొదలగునవి నిర్మాణము చేయవలెను. దిక్సాధన చేయక దిఙ్మూఢముగల క్షేత్రములో నిర్మాణము చేసిన వంశ నాశనము, ఇల్లరికము, దత్తత మొదలగునవి ప్రాప్తించుటయే గాక ధనక్షయము, కలహము కలుగును.

## వాస్తు పురుషోత్పత్తి

శ్లో॥ *సంగ్రామేంధక రుద్రయోశ్చ పతితస్వేదో మహేశాతిక్షతౌ।*
*తస్యాద్భూతమభూతవాస్తుజననం ద్యావాపృథివ్యోర్మహాత్।*
*తందేవా స్సహసానిగృహ్యానిహితాం భూమావధోవక్త్రకమ్।*
*దేవానాంవసూనాశ్చ వాస్తుపురుషస్తేనైవ పూజ్యోబుధైః॥*

అంధకాసురునితో ఈశ్వరుడు యుద్ధముచేసిన సమయమున ఈశ్వరుని దేహముమీది చెమట బిందువులు భూమిమీద పడగా దానివల్ల సంపత్కరమగు పెద్దభూతము పుట్టి భూలోక స్వర్గలోకముల మధ్య ప్రదేశమంతయు వ్యాప్తించగా, దేవతలు ఆ భూతలముపై నివాసము జేసిరి. కావున వాస్తు పురుషుడు భూలోకమునందు ఉండుటవలన సమస్తమైన వారు గృహారామ, తటాక, కూప, దేవాలయాదులు ప్రతిష్ఠ జేయునప్పుడు, వాస్తు పూజ విధిగా చేయుటవలన సర్వశుభములు గలుగును.

## వాస్తు పురుష స్థితి

శ్లో॥ *మాసేషు క్రమశ స్త్రిషు త్రిషు సదా ప్రాచీనభస్యాదితః।*
*సోపాదేయ మహీషు వాస్తుపురుష స్తద్వామశాయీభవేత్ ।*
*త్యక్త్వాతచ్చరణే క్షణస్థ కుకుభౌతత్పృష్ఠ మూర్ధస్థది*
*క్స్వాలాస్యేవ వినిక్షిపేత్తదుదరే శంకుం యథోక్తం సుధీః॥*

వ్యాఖ్యానం:

వాస్తుపురుషఃక్రమశో వక్ష్యమాణ ప్రకారేణ "ప్రాచీనభస్యాదితః" ప్రాచీన మారభ్య మాసేషు భాద్రపదమారభ్యే త్యర్థత్రిషుమాణేషు సదాతిష్ఠతి. అయమే వాశయః ప్రాచ్యాంభాద్రపదాశ్వియుజకార్తికేషు తతఃదక్షిణస్యాం మార్గశీర్ష పౌషమాఘే ప్రతీచ్యాం; ఫాల్గుణచైత్ర, వైశాఖేషు ఉదీచ్యాంజ్యేష్ఠాషాఢ శ్రావణేష్వతి సోపాదేయ మహీషు

స్వసోపాదేయాః యామహ్వాః తాసువామశాయీభవేత్, తచ్చరణే క్షణస్థకకు భౌతస్యవాస్తు పురుషస్వచరణేక్షణస్థే యేకకుభౌ దిశౌతేని దిశస్తు కకుభఃకాష్టా ఇత్యా మరఃత్యక్త్వా విహాయ తత్పృష్ఠ మూర్థస్థ దిక్చాలాసు తస్య వాస్తుపురుషస్య పృష్ఠ మూర్ధ్నోః యేదిశౌస్తఃతయోర్యా శాలాగృహా, తాస్వేవ తదుదరే తన్మధ్యభాగ ఏవసుధీర్విద్వాన్ యధోక్తంశాస్త్రోక్తరీత్యాశంకుంవినిక్షిపేత్ - స్థాపయేత్॥

వాస్తు పురుషుడు భాద్రపద, అశ్వయుజ, కార్తీక మాసములయందు తూర్పు శిరస్సుయై, పశ్చిమమున పాదములు ఉంచి వామశాయియై దక్షిణ పశ్చిమములు దృష్టి ప్రసరింపజేయును. కాన, దృష్టి ప్రసరించు వైపునకు సింహద్వారము ఉంచి, గృహ నిర్మాణముచేయుట మంచిది. అనగా పై మాసములలో దక్షిణ సింహద్వారము గల ఉత్తర గృహము, పశ్చిమ సింహద్వారముగల తూర్పు గృహము శంఖుస్థాపన చేసి గృహములు కట్టవలయును.

మార్గశిర, పుష్య, మాఘ మాసములయందు దక్షిణ శిరస్సుమై, ఉత్తరము పాదములు ఉంచి పశ్చిమ ఉత్తరము దృష్టి ప్రసరింప జేయును. కాన, పశ్చిమ సింహద్వారము గల తూర్పు ఇల్లు, ఉత్తర సింహద్వారముగల దక్షిణపు ఇల్లు శంఖుస్థాపన చేసి గృహములు కట్టవలయును.

ఫాల్గుణ, చైత్ర, వైశాఖ మాసముల యందు పశ్చిమ శిరస్సుయై, తూర్పు పాదములు ఉంచి ఉత్తర తూర్పు దిశలు దృష్టి ప్రసరింపజేయును. కాన, ఉత్తర సింహద్వారము గల దక్షిణ గృహము; తూర్పు సింహద్వారముగల పశ్చిమగృహము శంఖుస్థాపన చేసి గృహములు కట్టవలెను.

జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ మాసములయందు ఉత్తర శిరస్సుయై దక్షిణమున పాదములుంచి తూర్పు దక్షిణదిశలకు దృష్టి ప్రసరింప జేయును. కాన తూర్పు సింహద్వారముగల పశ్చిమ గృహము, దక్షిణ సింహద్వారముగల ఉత్తర గృహము శంఖుస్థాపన చేసి గృహముల నిర్మాణములు చేయవలయును.

## శంఖు ప్రతిష్ఠా స్థానము

శ్లో॥ *నవభాగం గృహక్షేత్రం కుర్యాన్మధ్యత్రయం పునః॥*
*భాగద్వయ మధోభాగే శేషనాభిః ప్రకీర్తితాః॥*

గృహ గర్భ పాదవును వాస్తు పురుషుని పాదములవైపు నుంచి 9 భాగములు వేసి, పాదముల వైపు నుంచి 5 భాగములు, శిరస్సు వైపునుంచి నాలుగు భాగములుగా విభజింపబడు చోటున శంఖుస్థాపన చేయవలయును.

శ్లో॥ వాస్తుపుంస శ్శిరశ్చంద్ర సూర్యభాగే ద్వికేస్థితః।
తృతీయభాగే భూపుత్రో బుధోభాగే చతుర్థకే।
గురుర్ముఖ్యే పంచమేతు శుక్రష్షష్టే ధనప్రదే।
నాశనం సప్తమే శౌరీ రష్టమం రాహు పీడనమ్।
నవమేకేతు శోకంచ నవభాగ గ్రహైః ఫలమ్॥

శ్లో॥ సోమోనాశం రవిః మృత్యుం భౌమో దాహం బుధైశ్శుభమ్
గురుర్ముఖ్యం కవిర్భాగ్యం శనిః పీడన శౌర్యకే।
రాహుర్మృత్యుం కేతురోగం నవభాగ ఫలం స్మృతమ్॥

వాస్తు పురుషుని శిరస్సునందు చంద్రుడు నాశనమును, 2వ భాగమున రవి మృత్యువును, 3వ భాగమున అంగారకుడు అగ్నిభయమును, 4వ భాగమున బుధుడు శుభమును, 5వ భాగమున గురుడు ప్రాముఖ్యమును, 6వ భాగమున శుక్రుడు భాగ్యమును, 7వ భాగమున శని పీడను, 8వ భాగమున రాహువు మృత్యువును, 9వ భాగమున కేతువు రోగమును, అయా స్థానములయందు శంఖుప్రతిష్ఠ చేసిరేని అయా ఫలములు కలుగునని తాత్పర్యము.

## రాహు ముఖన్యాసము

శ్లో॥ దేవాలయే గేహ విదౌ జలాశయే। రాహోర్ముఖం
శంభుదిశో విలోమతః। మీనార్క సింహార్క మృగార్క
తస్త్రిభే। ఖాతే ముఖాత్పృష్ఠ విదిక్ శుభం భవేత్॥

మీనము, మేషము, వృషభము ఈ మూడు రాశుల యందు రవి యుండగా రాహు ముఖము ఈశాన్యమున ఉండును. మిధునము, కర్కాటకము, సింహము ఈ మూడు రాశుల యందు రవి యుండగా వాయవ్యమున రాహు ముఖముండును కన్య, తుల, వృశ్చికము ఈ మూడు రాశులయందు రవి యుండగా రాహు ముఖము నైరుతిగా ఉండును. ధనస్సు, మకరము, కుంభము ఈ మూడు రాశులయందు రవి యండగా రాహు ముఖము అగ్నేయమున ఉండును. కాన, దేవాలయము మొదలగు పై నుదహరించిన రాహు ముఖమునందు ఖాతారంభము చేయరాదు (అనగా పునాదులు తవ్వరాదు). పృష్ఠభాగమున చేయవలయును.

## పక్షాంతర శంఖుస్థాపన నిర్ణయము

శ్లో॥ మధ్యమే దేవతాగారే ఈశాన్యం మనుజాలయే।
రాక్షసానాంతు నైరుత్యాం శంఖుం స్థాప్య సుమంగళమ్॥

దేవాలయములకు మధ్య భాగమునందు, గృహమునకు ఈశాన్యమునందు, రాక్షస ఆలయమునకు నైరుతి భాగమునందు శంకుస్థాపనము జేయుట ఉత్తమము.

శ్లో॥ సంప్రార్థ్య స్థాపయే ద్గేహే శంఖువై భిత్తి మధ్యమే॥

పై సూత్రప్రకారము ఈశాన్యమున గోడమధ్య శంఖును స్థాపించవలెను.

## శంఖు నిర్ణయము

శ్లో॥ *పాషాణ గేహకర్తవ్యా శిలా పాషాణ సంభవా ।*
*పక్వేష్ట నిర్మితే చైవ ఇష్టకానాంచ కారయేత్ ।*
*కాష్టాది నిర్మితే గేహే కాష్టమాన ప్రచక్ష్యతే॥*

పాషాణ గృహము అనగా కొండరాయితో కట్టిన గృహమునకు ఆ రాయితోనే శంఖును చేసి ప్రతిష్ఠ చేయవలెను. ఇటుకలతో కట్టిన గృహములకు ఇటుకతోనే శంఖును చేసి ప్రతిష్ఠ చేయవలెను. కాష్ట గృహములకు అనగా గోడలు లేని ఇండ్లు నిట్రాళ్ళతో వేయు పాకలకు కఱ్ఱతోనే శంఖుచేసి ప్రతిష్ఠ చేయవలెను. ఈ శంఖులను నవరత్న, సువర్ణ, తామ్ర, రజిత, నవధాన్యాదులచే పూజించి స్థాపించవలెను. అన్ని రకముల గృహములకు కఱ్ఱ శంఖును ఉపయోగించరాదు.

శ్లో॥ *తావత్కాల గృహస్థితి, గృహపతేర్యావశ్చ శంఖుస్థితిః*

ఆ కాష్ట శంఖు భూమిలో ఎంత కాలముండునో అంతకాలము గృహవసతి సౌఖ్యములు అనుభవించును. తతః తరువాత దుర్గుణములు ఏర్పడును.

## కాష్ఠ శంఖువల్ల దుర్గుణములు

శ్లో॥ *ఛేదనే ఛేదనం యాతి ఛేదనే బంధు ఛేదనమ్ ।*
*వేధనే భయముగ్రంచ చలితే చార్థనాశనమ్ ।*
*కలహం సోద్ధృతే నిత్యం భ్రస్యతే భ్రంశనే తదా।*
*ఏతత్సర్వం స కుర్వీత కర్తుః శుభ మపేక్షితా॥*

కాష్ఠ శంఖు ప్రతిష్ఠవల్ల కొన్ని దుర్గుణములు ఏర్పడును. ఆ శంఖును ఛేదించిరేని కర్తకు భంగము కలుగును. ఛేదించిరేని బంధు భేదము కలుగును. తొలిచిరేని దారుణమైన భయము కలుగును కదిలించిరేని ధన నాశనము కలుగును స్థలము నుంచి తప్పించిరేని కలహము, త్రిప్పట కలుగును. కాన, కర్తకు శుభమపేక్షించు వారు కాష్ఠ శంఖువును ప్రతిష్ఠ చేయరాదు.

## కాలశుద్ధి

శ్లో॥ *శిలాది దారు లోహానం దివౌ వా వాస్తుశోభనమ్।*

*రాత్రౌచేత్ వాస్తుకర్మాణీ భూతరాక్షస వాసితా॥*

శిలలతోను, దారువులతోను,లోహాదులతోను, వాస్తుకర్మలు ప్రారంభము చేయుట పగలు చాలా ఉత్తమము. రాత్రికాలమున ప్రారంభముచేసిరేని రాక్షసులు నివాసము చేయుదురని తాత్పర్యము.

శ్లో॥ *స్తంభే గ్రామ నివాసంచ తథా రాజ్య విశేషతః।*

*మధ్యరాత్ర విసర్జశ్చ పూర్వాహ్నే శుభముంచతే।*

*రాత్రి స్థంభే నకర్తవ్యం కర్తృభార్యా వినస్యతి॥*

స్తంభప్రతిష్ఠ గ్రామ నివాసము, రాజ్యాభిషేకాదులు మొదలగునవి అర్ధరాత్రి యందు విసర్జించవలెను. పూర్వాహ్ణము, పగటిపూట మొదటి భాగమున శుభము కలుగును. రాత్రి స్థంభప్రతిష్ఠ చేసిరేని కర్త భార్య నశించును.

శ్లో॥ *పూర్వాహ్నేచోత్తమంప్రోక్తం మధ్యా హ్నే మధ్యమంవిదుః*

*సంధ్యాయోపర రాత్రీచ క్షపాయాంచ వివర్జయేత్॥*

ఉదయము ప్రతిష్ఠ చేయుట ఉత్తమము, మధ్యాహ్నమున మధ్యమము, సంధ్యా సమయము, రాత్రికాలము అధమాధమము. కాన విసర్జించవలెను.

## రాత్రియందు వర్జించవలసిన కర్మలు

శ్లో॥ *కృషిం బీజవాపం నరేంద్రాభిషేకం।*

*సువిద్యా గృహారంభ దేవప్రతిష్ఠా।*

*చౌలోపనయ నాదిక నామనధేయా*

*క్షపాయాం విబుధా న కుర్వంతిజ్ఞేయా ।*

కృషి, బీజవ్యాపనము, రాజ్యాభిషేకం, విద్యాభ్యాసము, గృహారంభము, దేవప్రతిష్ఠ, నామకరణము, చౌళము, ఉపనయనము, వరక ప్రారంభము మొదలగునవి రాత్రి యందు చేయరాదు.

శ్లో॥ *విభజ్యాహ్న ప్రమాణంతు తత్రాద్యం చేపి దైవికమ్।*

*ద్వితీయం మానుషంకార్యం తృతీయంచేపి పైతృకమ్॥*

మొదటి యామములో దైవకార్యము, రెండవ యామములో మానుషకార్యము (గృహాది శుభకార్యములు), మూడవ యామములో శ్రార్ధముతో సమానమగు కార్యములు చేయవలెను.

## సిద్ధార్వణ ప్రచారము

శ్లో॥ *సంగ్రామ వ్యవహార ధామ నగరీ గ్రామేషు మంత్రార్వణే ।*
*జ్ఞాతే తస్యపి జన్మభేచ సతతం నామార జంస్యాత్ఫలమ్॥*

యుద్ధము, వర్తకము, గృహము, పురము, గ్రామము, మంత్రము మొదలగు అర్వణములు చూచునప్పుడు నామనక్షత్రమును , నామరాశియు ప్రధానముగా చూచుకొనవలెను.

శ్లో॥ *ఏకభే సప్తమే గ్రామే వైరం హాని స్త్రిషష్ఠచా*
*తుర్యాష్ట ద్వాదశే రోగః శేషస్థానే శుభం భవేత్॥*

నామరాశి మొదలు గ్రామరాశి వరకు గణనచేయగా 1,7 వైరము 3,6 హాని, 4,8,12 రోగము, 2,5,9,10,11 రాశులు శుభములు కలుగజేయును.

శ్లో॥ *వీక్ష్యతే ఉ_ర్వణ చక్రంతు దాంపత్య కృషి భూ గృహాన్।*
*దేశ గ్రామ గురూన్ భూపం మంత్రమౌషధ దైవతే॥*

దాంపత్యము, కృషి, భూమి, గృహము, దేశము, గ్రామము, గురువు మంత్రము, ప్రభువు, దేవత మొదలగు వాటికి అర్వణము చూచుకొనవలెను.

శ్లో॥ *ఊర్ధ్వగా సప్తదశేచ, రేఖా స్తిర్యక్త్రయం కురు।*
*ఉక్తక్రమేణ వర్ణాంకా, లిఖిత్కోష్టేషు షోడశ॥*

పదునేడు రేఖలు నిలువుగా, మూడు రేఖలు, అడ్డముగాను గీచినచో వరుసకు 16 గళ్ళు చొప్పున మూడు వరుసల మొత్తము 48 గళ్ళు వచ్చును. ఆ గళ్ళలో అంకెలను, అక్షరములను వ్రాయవలెను.

శ్లో॥ *ఏకాగ్ని హరబ్రహ్మా ద్వి సింధ్వర్క దశషడ్గజాః।*
*కళామనుమహాభూత, సప్తపక్ష త్రయోదశాః॥*

1,3,11,9,2,4,12,10,6,8,16,14,5,7,15,13 ఈ విధముగా 16 గళ్ళలోను అంకెలను వ్రాయవలయును.

శ్లో॥ *అకారాదిళకారాంతం పంచాశచ్చ పునః పునః।*
*లిఖేదేకాగ్ని రిత్యేతత్ శ్లోక సంఖ్యా క్రమేణతు॥*

"అ" కారము మొదలు "ళ" కారము వరకు 50 అక్షరములు ఒక్కొక్కటి చొప్పున మూడు వరుసలు వ్రాయగా మిగిలిన రెండు అక్షరములను ఆఖరు గడిలో 13 వ అంకె క్రింద వ్రాయవలెను.

శ్లో॥ *నామజన్మభ నామార, ప్రథమ స్థాక్షరం భవేత్।*

*తదాదౌ విలిఖేత్సమ్యా గర్వణం యస్య తన్యతు।*

అచ్చుబాటు లేక అర్వణము ఎవరికి కావలెనో వారి నామము యొక్క ప్రథమాక్షరముగానీ, నామనక్షత్రము యొక్క ప్రథమాక్షరముగాని మొదలు పెట్టి 50 అక్షరములను ఒకటి తరువాత ఒకటి చొప్పున వ్రాయవలెను.

అర్వణము చూచుటకు నామము యొక్క ప్రథమాక్షరమే ప్రధానముగా తీసుకొనుట చాలా ఉత్తమము.

**ఉదాహరణము :**

గంగారామ్ అనువానికి బందరు గ్రామములో అచ్చుబాటు అనగా లాభమా నష్టమా అని చూడవలసినప్పుడు "గ" కారము మొదలుకొని 50 అక్షరములను అంకెలు ఉన్న 16 గళ్ళలో వ్రాయగా తుది గడి 13 నందు 5 అక్షరములు ఉండును, అనగా ద,ళ, అః, క, ఖ అక్షరములు ఉండును.

**సిద్ధార్వణ మొదటి చక్ర ప్రచారము**

| 1 | 3 | 11 | 9 | 2 | 4 | 12 | 10 | 6 | 8 | 16 | 14 | 5 | 7 | 15 | 13 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ | ట | ఠ | డ | ఢ | ణ | త | ధ | ద |
| ధ | న | ప | ఫ | బ | భ | మ | య | ర | ల | వ | శ | ష | స | హ | ళ |
| అ | ఆ | ఇ | ఈ | ఉ | ఊ | ఋ | ౠ | | | ఏ | ఐ | ఓ | ఔ | అం | అః |
| | | | | | | | | | | | | | | | కఖ |

పైనుదహరించిన ప్రకారము చక్రప్రకారము వ్రాయవలెను. "లక్ష్మి" అను నామెకు అర్వణము చూడవలెననిన "ల" కారము నుంచి ప్రారంభము చేయవలెను.

శ్లో॥ *దూర్ధ్వగాః పంచరేఖాశ్చ తిగగ్రేఖా స్తథా కురు।*

*కోష్ఠకా షోడశాభూవన్ తేషు వర్ణాంచ లేఖనమ్॥*

నిలువుగా ఐదు రేఖలను, అడ్డముగా ఐదు రేఖలను గీచిన యెడల వరుసకు నాలుగు గళ్ళు చొప్పున నాలుగు వరుసలకు పదహారు గళ్ళ చక్రమేర్పడును. వాటిలో మొదటి చక్ర ప్రచారములో ఉన్న అంకెలను, వాటి క్రింద అక్షరములను వ్రాయవలెను. అనగా ఎడమ వైపు నుండి ప్రారంభించి 1 మొదలు 16 వరకు అంకెలను క్రమముగా అన్ని గళ్ళలోను వ్రాయవలెను. ఈ అంకెల ప్రకారము చక్రమునకు నాలుగు మూలల 4 గళ్ళ చొప్పున చూడగా 4 చక్రములు ఏర్పడును. అవి సిద్ధము, సాధ్యము, సుసిద్ధము, అరి అని అనబడును.

ఒక్కొక్క చక్రములో 1,2,5,6 గళ్ళు గల చక్రము సిద్ధము. 3,4,7,8 గళ్ళు గల చక్రము సాధ్యము. 11,12,16,15 గళ్ళు గల చక్రము సుసిద్ధము. 9,10,14,13 గళ్ళు గల చక్రము అరి యగును. మొదటి చక్రప్రచారములోని అంకెల క్రింద అక్షరములు రెండవ చక్రపచారములోని అంకెల క్రింద వ్రాయవలెను.

## సిద్ధార్ణ రెండవ చక్ర ప్రచారము

సిద్ధము సాధ్యము

| | | | |
|---|---|---|---|
| 1<br>గ, ధ, అ<br>సిద్ధము. | 2<br>ఛ, బ, ఉ<br>సాధ్యము. | 3<br>ఘ, న, ఆ<br>సిద్ధము | 4<br>జ, భ, ఊ<br>సాధ్యము. |
| 5<br>ష, ణ, ఓ<br>అరి. | 6<br>ట, ర,<br>సుసిద్ధము. | 7<br>త, న, ఔ<br>అరి. | 8<br>ఠ, ల,<br>సుసిద్ధము. |
| 9<br>ధ, ప, ఈ<br>సిద్ధము | 10<br>ఞ, య, ౠ<br>సాధ్యము | 11<br>ఙ, ప, ఇ<br>సిద్ధము. | 12<br>ఝ, మ, ఋ<br>సాధ్యము. |
| 13<br>ద, ళ, అః, క, ఖ,<br>అరి | 14<br>థ, శ, ఐ<br>సుసిద్ధము | 15<br>ఢ, హ, అం,<br>అరి | 16<br>డ, వ, ఏ<br>సుసిద్ధము |

శ్లో॥ యాన్నామ్నా లిఖ్యతే చక్రం తత్చక్రే తస్య సు ప్రియే।
మంత్రేచాద్యక్షరం వీక్ష్య తత్కోష్ఠ ఫల మూహ్యతే॥

ఎవరి నామమును బట్టి మొదటి చక్రము లిఖించబడునో ఆ చక్రమున వారికి అవసరమైన గ్రామము యొక్క ప్రథమాక్షరముగాని, మంత్రముయొక్క ప్రథమాక్షరము గాని ఏ నెంబరు గడిలోఉండునో ఆ నెంబరు రెండవ చక్రములో చూచి ఫలాఫలములు తెలుసుకోవచ్చును. "గంగారమ్"నకు బందరులో పనికి వచ్చునా అను నప్పుడు "గ" మొదలు అన్ని అక్షరములను మొదటి చక్ర ప్రచారములో ఉదహరించినట్లు వ్రాయవలెను. అప్పుడు "బ"అను అక్షరము మొదటి చక్రములో రెండవ గడిలో రెండవ అక్షరము, రెండవ చక్ర ప్రచారము చూడగా సిద్ధములో సాధ్యమైనది. అనగా రెండింతల సాధన వలన సిద్ధించును.

## సిద్ధార్వణ ఫలములు

శ్లో॥ సిద్ధ స్సిద్ధో జపాత్సిద్ధో ద్వీగుణాత్సిద్ధ సాధ్యకః।
తత్సు సిద్ధస్సు ఫలదస్తరి దారిద్రహా భవేత్ ॥

సిద్ధ చక్రములో సిద్ధము జపమువల్ల సిద్ధించును. సాధ్యము రెండింతల సాధన వల్ల సిద్ధించును. సుసిద్ధము స్మరించిన ఫలించును. అరి దరిద్రము కలుగజేయును.

శ్లో॥ సాధ్య సిద్ధస్సు సాధ్యస్స్యా త్సాధ్యః సాధ్యః ప్రయత్నతః ।
తత్సు సిద్ధస్స్మరణయా తదరి జ్ఞాతిహా భవేత్॥

సాధ్య చక్రములో సిద్ధము సాధ్యమగును. సాధ్యము ప్రయత్నించిరేని ఫలించును. సుసిద్ధము స్మరించిన సిద్ధించును. అరి జ్ఞాతిహాని కలుగజేయును.

శ్లో॥ సుసిద్ధ సిద్ధః ఫలద స్సాధ్యస్సాధ్యో భవే త్క్రమాత్ ।
తత్సుసిద్ధః క్షణాత్సిద్ధ స్తద్యరి ర్భ్రాతృహానికృత్॥

సుసిద్ధ చక్రములో సిద్ధము ఫలించును. సాధ్యము క్రమముగా ఫలించును. సుసిద్ధము క్షణములో ఫలించును. అరి సోదరహాని కలుగజేయును.

శ్లో॥ అరి సిద్ధం సుతం హంతి కారి సాధ్యస్తు మాతరమ్।
పత్నీ మరి సుసిద్ధశ్చ, తదరి స్యాత్మహా భవేత్॥

అరి చక్రములో సిద్ధము పుత్రునకు హాని కలుగజేయును. సాధ్యము తల్లికి హాని కలుగజేయును. సుసిద్ధము భార్యకు హాని గలుగజేయును. అరి తనకు హాని కలుగజేయును.

సిద్ధ, సాధ్య, సుసిద్ధ, అను మూడు చక్రముల యందలి సిద్ధ, సాధ్య, సుసిద్ధములు తొమ్మిది గళ్ళలో ఏ గడి యందైనను తనకు కావలసిన మంత్ర, గ్రామ, ప్రభు ప్రథమాక్షరము ఉండెనేని ప్రశస్తమైనదని తెలుసుకోవలెను. మూడు చక్రములందు అరి గళ్ళను, అరిచక్రము యొక్క నాలుగు గళ్ళయందు తను కోరిన అక్షరము ఉండెనేని అరిష్ట ప్రదమగును గాన తెలుసుకోవలెను.

## పక్షాంతర అర్వణ చక్రము

శ్లో॥ *ఊర్ధ్వరేఖాశ్చతః కృత్వా, తిర్యగ్రేఖశ్చ పంచచ।*
*తత్కోష్ఠేషు విభాగేచ శేషస్సమ్యగ్లి ఖే త్క్రమాత్॥*

నిలువుగా నాలుగు గీతలను, అడ్డముగా ఐదు గీతలను గీచినచో 12 గళ్ళేర్పడును. వాటిలో ఈ క్రింద చెప్పిన అంకెలను వేయవలెను.

శ్లో॥ *ఏకపంచ గ్రహాస్సిద్ధా స్సాధ్యా నేత్రర్తు భాస్కరాః।*
*సుసిద్ధాస్త్ర్య గ్రహోరుద్ధాః చతురష్టా దశారయః॥*

| | | | |
|---|---|---|---|
| 9 | 5 | 1 | సిద్ధము |
| 12 | 6 | 2 | సాధ్యము |
| 11 | 7 | 3 | సుసిద్ధము |
| 10 | 8 | 4 | అరి |

మొదటి వరుస 9,5,1 సిద్ధము.
రెండవ వరుస 12, 6, 2 సాధ్యము.
మూడవ వరుస 11,7,3 సుసిద్ధము.
నాలుగవ వరుస 10, 8, 4 అరి.

శ్లో ॥ *నామాక్షరాణి కర్తుస్త్రి గుణితాని యుతానిచ ।*
*నామాక్షరైర్గృహాదీనాం ద్వాదశేన హృతానివై॥*
*త్యక్త్వా దశ చతూరష్టా అర్వణం యస్య తస్యతు*
*తచ్ఛేషం నవ పంచేకం గృహభూమ్యాది సంగ్రహే॥*

అరణ్యము చూడగోరువారు వారి నామక్షరముల సంఖ్యను 3చే గుణించి అవసరమైన కృషి, భూమి, గృహ, గ్రామ మొదలగు నామాక్షరముల సంఖ్యను కలిపి, 12 చేత భాగించగా శేషము 10,8,4 వచ్చిన ఎడల అరియగును కనుక అశుభములు కలుగజేయును. 9, 5, 1 వచ్చిన సిద్ధము, 12, 6, 2 వచ్చిన సాధ్యము 11, 7, 3 వచ్చిన సుసిద్ధమగును.

శ్లో॥ సిద్ధాస్తు బాంధవాః ప్రోక్తా స్సాధ్యాస్తు స్సేవకా స్మృతాః ।

సుసిద్ధాః పోషకాజ్ఞేయా అరయో ఘాతకా స్తథా॥

సిద్ధము బంధువు వంటిదగును. సాధ్యము సేవకుని వంటిదగును. సుసిద్ధము పోషకుని వంటిదగును. అరి ఘాతకుని వంటిదగును కావున అర్వాణ విషయము జాగ్రత్తగా చూచుకొనవలెను.

# ఎనిమిదవ అధ్యాయము

## ముహూర్త ఖండము

శ్లో॥ *యః కర్తా జగతాం భర్తా సంహర్తాన్ మహసాం నిధిః॥*

*ప్రణమామి తమాదిత్యం బహిరంత స్తమోపహమ్॥*

జగతాం = లోకములకు, భర్తా = ప్రభువైనటువంటిన్నీ, సంహర్తా= లయకరుడైనటువంటిన్నీ, మహసాం = తేజస్సులకు, నిధిః = స్థానమైనవాడును, యః = ఎవడో, అహం = నేను, బహిరంతః = లోపల, వెలుపల నుండినటువంటి, తమః = అజ్ఞానాంధకారమును, అపహా = పోగొట్టునటువంటిన్నీ, తమాదిత్యం = అట్టి సూర్యునిగురించి, ప్రణమామి = సమస్కరించుచున్నాను.

## నామ నక్షత్ర రాశి సౌంజ్ఞ

| | | |
|---|---|---|
| చూ - చె - చో - లా | అశ్వనీ | మేషము |
| లీ - లూ - లే - లో | భరణీ | |
| అ - - - | కృత్తిక | |
| - ఈ - ఊ - ఏ | కృత్తిక | వృషభము |
| ఓ - వా - వీ - వూ | రోహిణి | |
| వే - వో - - | మృగశిర | |
| - - కా - కీ | మృగశిర | మిధునము |
| కూ - ఖం - గ - చా | ఆరుద్ర | |
| కే - కో - హా | పునర్వసు | |
| - - - హి | పునర్వసు | కర్కాటకము |
| హూ - హే -హో - డా | పుష్యమి | |
| డీ - డూ - డే - డో | ఆశ్లేష | |

| | | |
|---|---|---|
| మా - మీ - మూ - మే | మఘ | సింహము |
| మో - టా - టీ - టు | పుబ్బ | |
| టే - - - | ఉత్తర | |
| - టో - పా - పి | ఉత్తర | కన్య |
| పూ - ష - ణా - ఠ | చిత్త | |
| పే - పో - - | హస్త | |
| - - రా - రీ | చిత్త | తుల |
| రూ - రే - రో - తా | స్వాతి | |
| తీ - తూ - తే - | విశాఖ | |
| - - - తో | విశాఖ | వృశ్చికము |
| నా - నీ - నూ - నే | అనూరాధ | |
| నో - యా - యీ - యు | జ్యేష్ఠ | |
| యే - యో - బా - బీ | మూల | ధనుస్సు |
| భూ - ధా - భా - ఢ | పూర్వాషాఢ | |
| బే - - - | ఉత్తరాషాఢ | |
| - బో - జా - జీ | ఉత్తరాషాఢ | మకరము |
| జూ - జే - జో - ఘా | శ్రవణము | |
| గా - గీ - - | ధనిష్ఠ | |
| - - గూ - గే | ధనిష్ఠ | కుంభము |
| గో - సా - సీ - సు | శతభిషము | |
| సే - సో - దా | పూర్వభాద్ర | |

| | | |
|---|---|---|
| - - - దీ | పూర్వాభాద్ర | |
| దు - శ్యం - ఝూ-దా | ఉత్తరాభాద్ర | మీనము |
| దే - దో - చా - చి | రేవతి | |

శ్లో॥ కంగచ్ఛ రౌద్రభేచైవ, షణడా హస్త తారకే ।
ఢభడా పూర్వ అషాఢ్యా శ్యంచదా భాద్ర ఉత్తరే ॥

కం, గ, చ్ఛ అను 3 అక్షరములు ఆరుద్రా నక్షత్రము యొక్క 2-3-4 పాదబోధకములనియు, ష, ణ, డ యనునని హస్త నక్షత్రము యొక్క 2-3-4 పాద సూచకములనియు, ఢ, భ, డా అనునవి పూర్వాషాఢ నక్షత్రము యొక్క 2-3-4 పాదజ్ఞాపకములనియు, శ్యం, చ, దా అనునవి ఉత్తరాభాద్ర నక్షత్రము యొక్క 2-3-4 పాదవ్యాజకము లనియు తెలయవలెను.

శ్లో॥ కృష్టో హృష్టో శ్రీ ధరః క్షేత్రపాలో
జ్ఞానో భీమో భైరవశ్చేతి నామ్నామ్
సౌమ్యస్వాతీ త్వష్టు హస్తార్ద్ర మూలః
పూర్వాషాఢా చాహురేతాని సప్త॥
మారుతస్య తృతీయేచ ద్రోణ ద్రౌపతి శబ్దయోః
క్షేమోదితేః పూర్వపాదే ఫణీనామ్నోత్తర స్తథా
యల్లనా యాచనామగ్ని ర్యజ్ఞనామచ శక్రధే
యెల్లినా మూల నక్షత్ర మితినక్షత్రసంజ్ఞితః॥

"కృష్టుడ"ను పేరునకు మృగశిర 3వ పాదము; "హృష్టుడ"ను పేరునకు స్వాతీ 1 వ పాదము; "శ్రీధరుడ"ను పేరునకు చిత్తా 4 వ పాదము; "క్షేత్రపాలుడ"నుటకు హస్త 2వ పాదము, "జ్ఞానుడ"నుటకు ఆరుద్ర 3 పాదము; "భీముడ"నుటకు మూలా 3 వ పాదము, "భైరవుడ"నుటకు పూర్వాషాఢ 4 వ పాదము; "క్షేముడ"నుటకు పునర్వసు 1వ పాదము; "ఫణి" యనుటకు ఉత్తర 3 వ పాదము; "ద్రోణుడ"నుటకు, 'ద్రౌపతి' అనుటకు స్వాతీ 3వ పాదము; "యల్లన" యనుటకు, మూల 1వ పాదమనియు నవకహడాది చక్రమునందు చెప్పబడెను.

శ్లో॥ బ్రహ్మ ప్రభాకరం చైవ చిత్తార్థం తులమేవచ ।
తస్యాపరాక్షరం చైవ పూర్వ పూర్వాక్షరం త్యజేత్ ।
ఐత్యమాత్రేన సంయుక్తం యద్యుక్తం బ్రహ్మయోమిళే ॥

బ్రహ్మ ప్రభాకరుడను పేరులకు చిత్త 3వ పాదము, తులా రాశి యగును. . ఐ, ఔ అను స్వరమ్ములే నామములయొక్క ప్రధమ అక్షరముల కుండునో అట్టి నామము లన్నిటికి ఆ స్వరములను త్యజించి ప్రథానాక్షరములను గ్రహించవలెనని బ్రహ్మయామిళమున చెప్పబడెను.

## ద్వయనామ నక్షత్ర నిర్ణయము

శ్లో॥ *నరస్య ద్వయ నామాచ ఆది నామాన్ విసర్జయేత్॥*
*అంత్య నామ గృహీత్వాచ ఇత్యేతే లగ్న కారణమ్॥*

విశేష నామములు గలవారు ఆదినామములను విసర్జించవలయును. అనగా, వెంకట సూర్య అప్పారావు అను నామమునకు - అప్పారావు అనే పేరు ఖాయమగును.

## శంఖు స్థాపన సమయములు

శ్లో॥ *గృహసంస్థాపనం చైత్రే ధనలాభ శుభప్రదం ।*
*వైశాఖేతు శుభం వింద్యా జ్యేష్ఠేతు మరణం ధృవమ్।*
*ఆషాఢే గోకులం హంతి శ్రావణే భృత్య వర్ధనం।*
*భాద్రపే రోగపీడాచ ఆశ్వినే కలహం తథా।*
*కార్తీక్యాం ధన లాభస్స్యా న్మార్గశీర్షే ధనక్షయః ।*
*పుష్యేచాగ్నిభయం నిత్యం మాఘేతు బహు పుత్రదం*
*ఫాల్గుణే తను నాశస్స్యా న్మాసానాంచ ఫలాఫలమ్॥*

చైత్రమాసమున శంఖుస్థాపన ధనలాభము, శుభప్రదమును, వైశాఖమున శుభమును, జ్యేష్ఠమున మరణమును, ఆషాఢమున పశునాశనమును, శ్రావణమున పరిచారిక వృద్ధి, భాద్రపదమున రోగపీడ, ఆశ్వీయుజమున కలహము, కార్తీకమున ధనలాభము, మార్గశిరమున ధనక్షయము, పుష్యమున అగ్నిభయము, మాఘమున పుత్రలాభము, ఫాల్గుణమున శరీర నష్టమును క్రమముగా ఆయా మాసములందు ఆయా ఫలములు కలుగును.

## సౌర మాస ఫలములు

శ్లో॥ *గో కర్కి హరి కుంభాజ, తౌళి కీట మృగే స్థితే*
*దివాకరే గృహారంభః పుత్రపౌత్రాభివృద్ధిదః॥*

వృషభ, కర్కాటక, సింహ, కుంభ, మేష, తుల, వృశ్చిక, మకర రాశులందు రవి ఉండగా గృహారంభము చేసిరేని పుత్రపౌత్రాభివృద్ధి కలుగజేయును.

శ్లో॥ *స్థిరే రాశిగతే సూర్యే గృహ కర్మసు శోభనమ్।*

*చరేతు మధ్యమం విన్ద్యా ద్విస్వభావేతు నిందితమ్॥*

రవి స్థిర రాశులయందు ఉండగా గృహనిర్మాణములు చేసిన శుభము. చరరాశుల యందు ఉండగా మధ్యమ ఫలము, ద్విస్వభావ రాశులయందు ఉండగా నింద్యఫలములు కలుగును.

## మీన చైత్ర్య దోష భంగము

శ్లో॥ *మేషాయన ప్రవేశేతు తదారభ్య ప్రయత్నతః*

*వివాహం శుభ మిచ్ఛంతి గర్గ కశ్యప దేవతాః॥*

*మీన చైత్ర్య మహాదోషః కళింగే, వంగ, సింధుము।*

*వివాహం వర్జయే త్తత్ర చాన్యేషు యశుభప్రదః।*

*వింధ్యస్య దక్షిణే దేశే మీన చైత్ర్య శుభావహః।*

*తస్యస్యా స్సౌమ్య భాగేతు మేషచైత్ర్య శుభావహః।*

*వివాహే మీన చైత్రేతు యావన్మేషం విశే ద్రవిః।*

*తావద్వైవాహికం కర్మ కుర్యాద్వింధ్యస్య దక్షిణం-*

*ఇత్యుక్తత్వాత్॥*

అని పరాశర సంహితయందు చెప్పబడినది. ధనుర్మకర, కుంభ రాశులయందు రవి ఉండగా పుష్యమాసము కంటే; మేష, వృషభ, మిధున, తులా, కుంభరాశుల యందు రవి యుండగా, వైశాఖ, జ్యేష్ఠ, పాల్గుణ మాసముల యందు వివాహాది శుభకర్మలు చేయుట మంగళకరమనియు; కార్తీక మార్గశిరములందు చేయుట అల్పప్రదమనియు; రవి పుష్య మాసమందు ధనుర్మకరరాశుల యందు, ఆషాఢ మాసమున మిధున కర్కాటకముల యందు ఉండగా వివాహాది శుభకర్మలు చేయుట అమంగళకరమనియు, రవి చైత్రమాస మందు మీన రాశియందు ఉండగా కలిగెడి దోషము వింధ్య పర్వతమున కుత్తరదేశమునకు అనగా కళింగ, వంగ, సింధు దేశములకే గాని దక్షిణ దేశస్థులకు మీన చైత్ర మందు మేషాయన ప్రవేశమైనను, వివాహాది శుభకర్మలు చేయుట శుభమని అర్థము.

## వార ఫలములు

శ్లో॥ *సోమే భృగేచ సౌఖ్యంతు బుధే గుర్వేచ విత్తదం।*

*కుజే సూర్యే సదా దుఃఖం, మందే తస్కర బాధకమ్॥*

సోమ, శుక్రవారములందు గృహారంభము చేసిన సౌఖ్యము; బుధ, గురు వారములందు ధనవృద్ధి, ఆది కుజవారములయందు ఎల్లప్పుడూ దుఃఖములు కలుగును. స్థిరవారమున దొంగల భయము కలుగును. కొందరి మతమున స్థిర వారమున స్థిరత్వము కలుగుననియు, దొంగల భయము కలుగదనియు ఉన్నది.

## తిథి పలము

శ్లో॥ *తిథి శ్శరీరం తిథిరేవ కారణం।*

*తిథి ప్రమాణం తిథిరేవ సాధనమ్।*

*తిథిర్వినా నాత్ర శుభేమ సాధ్యం।*

*తిథిఃఫలం ప్రోక్త మిదం మహర్షిణా॥*

గృహాది నమస్త శుభకార్యములకు తిథి శరీరముగాను, కారణముగాను, ప్రమాణముగాను, సాధనముగాను ఉండుటవలన శుభకరమై తిథులయందు గృహారంభాదులు చేయవలెను. అనగా.....

శ్లో॥ నందా భద్ర జయారిక్త। పూర్ణాస్యు స్తిథయః క్రమాత్॥

| | | | | |
|---|---|---|---|---|
| నంద | భద్ర | జయ | రిక్త | పూర్ణ |
| పాడ్యమి | విదియ | తదియ | చవితి | పంచమి |
| షష్ఠి | సప్తమి | అష్టమి | నవమి | దశమి |
| ఏకాదశి | ద్వాదశి | త్రయోదశి | చతుర్దశి | పౌర్ణమి |

జయ, భద్ర, పూర్ణ తిథులయందు గృహారంభము చేయవలెను.

శ్లో॥ *రోహిణీ మృగ చిత్రార్క వాసవోత్తర వైశ్వభం।*

*శ్రవణం చైవ భాన్యష్టా శస్తా సా గృహ కర్మణే॥*

రోహిణీ, మృగశిర, చిత్తా, హస్తా, జ్యేష్ఠా, ఉత్తర, ఉత్తరాషాఢ, శ్రవణము ఈ 8 నక్షత్రములు గృహకర్మల యందు ప్రశస్తమములు.

శ్లో॥ స్వాతి పుష్యామరాధాశ్వి శతాహిర్బుధ్న్య పౌష్ణభమ్॥
సప్తమేధః ఫలాన్యత శేషాణి పరివర్జయేత్॥

స్వాతీ, పుష్యమి, అనూరాధ, అశ్వని, శతతార, ఉత్తరాభాద్ర, రేవతీ- ఈ 7 నక్షత్రములు మధ్యమ ఫలముల నిచ్చును. మిగిలిన నక్షత్రములను విడిచిపెట్టవలెను.

శ్లో॥ అశ్వనీ శస్యతే తారా గృహస్థాపన కర్మణీ
భరణీ మరణం కుర్యా త్కృత్తికా మందిరం దహేత్
రోహిణీ ధనపుత్రాప్తిం కురుతే గృహిణీం యశః
మృగశీర్షం వపుష్కాంతి మారుద్రాన్ భయకారిణీ
పునర్వసూ ధనప్రాప్తి, పుష్యా కృష్యాది మానదా
ఆశ్లేషా రాజభయదా మఖాల్ప సుతదాయినీ
ఫల్గుణీ దైన్య మత్యంత ముత్తరా బహు మానదా
హస్తా యశస్సుతాన్ దద్యా చ్చిత్రా చిత్రాలయాంబరం
స్వాత్యన్య మందిరే స్థానం విశాఖాగ్ని భయప్రదా
అనూరాధా సుహృద్వృద్ధిం కుర్యాదైంద్రీ క్షుధం భయమ్
మూలా శత్రు వినాశాయ పూర్వాషాఢా జలద్భయమ్
వైశ్వ్యాసుత ధనామోద మభిజిచ్ఛ్రియ మిచ్ఛతి
శ్రవణాత్కీర్తి పుష్టించ వాసవాఖో వసుప్రదః
శతతారాయురారోగ్యం పూర్వాభాద్రాంగహీనతా
అహిర్బుధ్న్యస్తు దారిద్ర్యం పౌష్ణవం పశువర్ధనం
కుర్యాత్కర్తుర్మందిరంచ ఫలా నేత్యానిభార్గవ
గృహరేఖా యధా చంద్రా దిష్టా యత్నేన వర్జయేత్॥

అశ్వని యోగ్యమైనది, భరణి మరణము, కృత్తిక అగ్నిభయము, రోహిణి ధనపుత్ర కళత్ర సౌఖ్యము, కీర్తి, మృగశిర శరీరకాంతి, ఆరుద్ర భయము, పునర్వసు ధనము, పుష్యమి కృషి మొదలగునవి. ఆశ్లేష రాజభయము, మఖ అల్పసంతానము, పుబ్బ దీనత్వము, ఉత్తర బహుమానమును, హస్త కీర్తి, పుత్రులు, చిత్త చిత్రగృహము, వస్త్రలాభము, స్వాతి పరగృహనివాసము, విశాఖ అగ్నిభయము, అనూరాధ మిత్ర వృద్ధియు, జ్యేష్ఠ ఆకలి, మూల శత్రునాశనము, పూర్వాషాఢ జలభయము, ఉత్తరాషాఢ ధనపుత్ర సంతోషము, అభిజిత్తు సంపద, శ్రవణము కీర్తి, పుష్టి, ధనిష్ఠ బంగారము,

శతభిషము ఆయురారోగ్యము, పూర్వాభాద్ర అంగవిహీనము, ఉత్తరాభాద్ర దరిద్రము, రేవతీ పశుసంపద కలుగజేయును. మరియు యుక్తనక్షత్రములైనను, సప్త శలాల చక్రమున చంద్రాధిష్ఠితంబై గ్రహవేధ గలిగెనని యా నక్షత్రమును వర్జించవలెను.

## పక్షాంతరమున శుభనక్షత్రములు గృహాది సమస్త శుభకార్యములకు

శ్లో॥ *మఖా మృగశిరో హస్తా స్వాతీ మూలానురాధయోః।*
*రేవతీ రోహిణీచైవ ఉత్తరాణాం త్రయమ్ శుభం*
*యేతే వైవాహ మాంగళ్యం వస్త్రకాంచన భూషణమ్।*
*బీజానాం వాపనం కుర్యాత్ గజానా మశ్వబంధనం।*
*క్షేత్రారంభే గృహారంభే సర్వకార్యే శుభప్రదమ్॥*

మఖ, మృగశిర, హస్త, స్వాతీ, మూలా, అనూరాధా, రేవతీ, రోహిణీ, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర ఈ పదకొండు నక్షత్రములు గృహాది సమస్త కార్యములకు ఉత్తమములు. అనగా, వివాహము, వస్త్రధారణము, సువర్ణాలంకారములకు విత్తనములు వేయుటకు, ఉవనయునమునకు, ఏనుగులు, గుఱ్ఱములను బంధించుటకు, గృహారంభాదులకు శుభములు.

## యోగ ఫలములు

శ్లో॥ *పరిఘస్యచ పూర్వార్థం కృత్స్నం వైధృతి పాతయోః।*
*గండాతిగండయోష్షట్ నాడికాః పంచశూలగే॥*

పరిఘనామ యోగము మొదటి సగమును, వైధృతి వ్యతీపాతుల యొక్క మొత్తము, గండాతిగండమ యోగములలో ఆరు ఘడియలు, శూలనామ యోగమున ఐదు ఘడియలు విడిచిపెట్టవలెను.

శ్లో॥ *వ్యాఘాతే నవనాడీశ్చ వాస్తుకర్మణి వర్జయేత్॥*
*నింద్య యోగేషు సర్వేషు విష్ట్యాం సర్వాణి వర్జయేత్॥*

వ్యాఘాత నామయోగమున 9 ఘడియలు, సమస్త నిందితములైన యోగము లును, కరములును సర్వము విడువవదగినవి.

## లగ్న ఫలములు

శ్లో॥ *సూర్యాంగారక లగ్న వర్గ రహితం సర్వం స్థిరం శోభనం*
*లగ్నంవాద్వీశరీర మిత్రగృహిణీ లగ్నం చరం చంచలం*

సూర్యాంగారకలగ్న మప్యథశుభం సౌమ్యగ్రహైస్సంయుతం
సౌమ్యైర్వా యది వీక్షితం సుబలిభిః క్రూరాస్త్రిషష్ఠాయగాః॥

సింహ, వృశ్చికములు, వాని షడ్వర్గులుగాక తక్కిన స్థిరలగ్నములు, ద్విస్వభావ లగ్నములు స్థంభప్రతిష్టకు శుభకరములు. చరలగ్నమును చాంచల్యములు కలిగించును. మరియు నిషిద్ధములైన సింహ, వృశ్చికములు శుభగ్రహయుక్తములై ఉన్ననూ, అధిక బలయుక్త శుభగ్రహములచే చూడబడుచున్ననూ, పాపగ్రహములు 3, 6, 11 స్థానములందుండినప్పుడే సింహ వృశ్చిక లగ్నములు శుభకరములని తెలియవలెను.

## శ్రావణమాస సప్త సహకార విశేష గృహారంభ ఫలములు

శ్లో॥ శనౌ స్వాతీ సింహలగ్నం శుక్ల పక్షంచ సప్తమీ॥
శుభయోగః శ్రావణశ్చ సకారా స్సప్తకీర్తితః॥
సప్తానాం యోగతో వాస్తుః పుత్రవిత్తప్రద స్సదా।
గజశ్చ ధనధాన్యాని పురే తిష్ఠంతి సర్వతః

శనివారము, స్వాతీ నక్షత్రము, సింహలగ్నము, శుక్లపక్షము, సప్తమీ శుభయోగము, శ్రావణమాసమునందు పై సకారము గల కాలమందు గృహారంభము చేసిరేని, కలకాలము గజ రథ తురగ పదాతిదళ ధన ధాన్య సంపదలు కలుగునని చెప్పబడెను.

## సప్త భూ లక్షణము

శ్లో॥ ప్రద్యోతనాత్పంచనగాంక సూర్యనవేందుషడ్వింశమితానిభాని।
ఏతే మహీస్వైవగృహం విధేయం తటాక వాపీ ఖననం నశస్తమ్॥

రవి ఉండు నక్షత్రమునకు ఐదు, ఏడు, పది, రెండు, తొమ్మిది, ఒకటి, ఆఱు-నక్షత్రములు భూమికి నిద్ర కలుగజేయునవి అగును. కనుక ఈ నక్షత్రము లందు గృహారామ తటాక వాపీ కూపాదులు నిర్మింపరాదని తెలియవలెను.

శ్లో॥ పాపేషు త్రిభవారిగేషు బలిషు స్థంభ ప్రతిష్ఠాలయా
త్కేంద్ర ద్వి త్రిభవ త్రికోణ సహితే ష్వార్యబ్జ కావ్యేందుమ
స్వోచ్చస్వాలయ మిత్రరాశి సహితే ష్వర్కాదిమద్రవ్యదం
కార్యం సద్మ గురౌ భృగౌ రిపుగతే నీచస్థితే వార్తిదమ్॥

బలయుక్తములైన పాపగ్రహములు లగ్నమునకు 3, 6, 11, స్థానములందును గురు, బుధ, శుక్ర, చంద్రులు 1, 2, 3, 4, 5, 7, 9, 10, 11 స్థానము లందును రవ్యాది సమస్త గ్రహములు తమ తమ ఉచ్ఛస్థానముల యందును, స్వక్షేత్ర మిత్ర క్షేత్రములందు ఉండగా కట్టిన గృహములు సంపద ప్రదములగును. గురుడు తనకు నీచ శత్రుక్షేత్రమగు మకరరాశియందు ఉండగా, శుక్రుడు తన నీచక్షేత్రమగు కన్యారాశి యందుండగా కట్టిన గృహములు పీడాకరములగునని కాలామృత అభిప్రాయము.

శ్లో॥ *ప్రాప్తే స్త్రిషష్ఠాయగతై త్రికోణ। కేంద్రాశ్రితైః*
*సాధుభి రాలయస్య। వదంతి నిర్మాణ మహాష్టమస్థ।*
*క్రూరస్తు కర్తు ర్మరణం కరోతి॥*

3, 6, 11 స్థానములందు పాపగ్రహములు, కేంద్రములైన 1-4-7-10 స్థానములందు శుభ గ్రహములు ఉండగా, అష్టమ స్థానమున గ్రహవర్జితమైన లగ్నమున గృహారంభము చేసిన శుభకరమగును. అష్టమ స్థానమున పాపగ్రహమున్న యెడల గృహకర్తకు మరణము కలుగును కాన, అష్టమ శుద్ధి ఉండవలెను. చతుర్థ శుద్ధికూడా ఉండవలెనని కొందరి అభిప్రాయము.

## లగ్న ద్వాదశ భావ ఫలములు

శ్లో॥ *లగ్నే ర్కే వజ్రపాతస్స్యా త్సోమే హానిశ్చ శీతగౌ।*
*మృత్యు ర్విశ్వరంభరా పుత్రే దారిద్ర్యం రవినందనే॥*

లగ్నమున రవి ఉండెనేని పిడుగుపడును. చంద్రుడున్న ధనహానియు, అంగారకుడున్న మరణము, శని ఉన్న దరిద్రము కలుగును.

శ్లో॥ *జీవే ధర్మార్థ కామాస్స్యుః పుత్రోత్పత్తిశ్చ భార్గవే।*
*చంద్రజే కుశలాశక్తి ర్వ్యావదాయః ప్రవర్తతే॥*

లగ్నమున గురుడున్న ధర్మార్థకామము, శుక్రుడున్న పుత్రోత్పత్తి, బుధుడున్న నిపుణమైన శక్తి కలుగును.

శ్లో॥ *ద్వితీయస్థే రవౌహానిం చంద్రే శత్రుక్షయం భవేత్ ।*
*భూమిజే బంధనం ప్రోక్తం నానా విఘ్నాని భానుజే॥*

లగ్నమునకు రెండవ స్థానమున రవి ఉన్న యెడల హాని, చంద్రుడున్న ఎడల శత్రుక్షయము, అంగారకుడున్న యెడల బంధనము. శని ఉన్న యెడల నానా విధములైన కష్టములు కలుగును.

శ్లో॥ *బుధే ద్రవిణ సంపత్తి ర్గురౌ ధర్మాభి వర్ధనమ్।*
*యధా కామ వినోదేవ భృగౌ కామం వ్రజేత్ఫలమ్॥*

లగ్నమునకు రెండవ స్థానమున బుధుడున్న ఎడల ద్రవ్య సంపత్తియు, గురుడున్న యెడల ధన ధాన్యసమృద్ధియు, శుక్రుడున్న యెడల ఇష్టానుసారమైన భోగములు కలుగును.

శ్లో॥ తృతీయస్థేషు పాపేషు సౌమ్యేష్వేవ విశేషతః।

సిద్ధిస్స్యా దచిరాదేవ యథాభిలషితం ప్రతి॥

లగ్నమునకు మూడవ స్థానమున పాపులున్నను, శుభలున్నను దోషములేదని, నానావిధములైన సంపదలు కలుగునని భావము.

శ్లో॥ వియోగ స్సుహృదాం భానౌ మంత్ర భేదా మహీసుతే।

బుద్ధినాశో నిశానాథే స్సర్వనాశోర్కనందనే॥

లగ్నమునకు నాలుగవ స్థానమున రవి ఉన్న ఎడల స్నేహ వియోగము, అంగారకుడున్న ఎడల మంత్రభేదము, చంద్రుడున్న ఎడల బుద్ధి నాశనము, శని ఉన్న ఎడల సర్వనాశనము కలుగును.

శ్లో॥ చతుర్థ స్థానగే జీవే పూజా సంపద్యతే నృపామ్।

చంద్రజే చార్థ లాభస్స్యా ద్భూమిలాభశ్చ భార్గవే॥

లగ్నమునకు నాలుగవస్థానమున గురుడున్న రాజ్యపూజ్యము, సంపద, బుధుడున్న ధనలాభము, శుక్రుడున్న భూలాభము కలుగును.

శ్లో॥ పంచమేతు సురాచార్యే మిత్రం వసు ధనాగమః

శుక్రే పుత్రసుఖావాప్తి రత్నలాభ స్తథేందుజే॥

లగ్నమునకు ఐదవ స్థానమున గురుడున్న ఎడల మిత్రులు, ధనధాన్యాదులు శుక్రుడున్న సుఖప్రాప్తి, బుధుడున్న ఎడల రత్నలాభము కలుగును.

శ్లో॥ సుత దుఃఖ సహస్రాంశౌ శశాంకే కలహస్స్మృతః

భౌమే కార్యవిరోధస్స్యా త్సౌరే బంధు వివర్ధనమ్॥

పంచమ స్థానమున రవి ఉన్న ఎడల సుతదుఃఖము, చంద్రుడున్న ఎడల కలహము, అంగారకుడున్న ఎడల కార్యహాని, శని ఉన్న ఎడల బంధు సమ్మర్ధము కలుగును.

శ్లో॥ షష్ఠస్థానే గతే సూర్యే రోగనాశం వినిర్దిశేత్।

చంద్రే పుష్టిః కుజేప్రాప్తిః సౌరీ శత్రు బలక్షయః॥

లగ్నమునకు ఆరవ స్థానమున రవి ఉన్న ఎడల రోగ నాశనము, సకల సౌఖ్యములు కలుగును. చంద్రుడున్న యెడల పుష్టి, అంగారకుడున్న ఎడల ధనాధిక్యమును, శని ఉన్న ఎడల శత్రునాశనము కలుగును.

శ్లో॥ *గురౌ మంత్రోదయః ప్రోక్తో భృగౌ విద్యాగమో భవేత్।*

*సౌమ్యే జ్ఞానార్థ కౌసల్యా న్నక్షత్రపతి నందనే॥*

లగ్నమునకు ఆరవస్థానమున గురుడున్న ఎడల మంత్రోదయము, శుక్రుడున్న ఎడల విద్యాలాభము, బుధుడున్న ఎడల అణకువ, జ్ఞానార్థ కుశలతయు కలుగును.

శ్లో॥ *సప్తమస్థానగే జీవౌ బుధే దైత్యపురోహితే।*

*గజవాజి ధరిత్రీణాం క్రమాల్లాభ వినిర్దిశేత్॥*

లగ్నమునకు ఏడవ స్థానమున గురు, బుధ, శుక్రువులున్న ఎడల ఏనుగులు, గుఱ్ఱములు-అనగా వాహనములు, భూలాభము కలుగును.

శ్లో॥ *భాస్కరే కీర్తి భంగస్స్యా త్కు జే విపద మాదిశేత్॥*

*హిమగే క్లేశ ఆయాసః పతంగే స్యంగనా భయమ్॥*

లగ్నమునకు ఏడవ స్థానమున రవి ఉండెనేని కీర్తినశించును. అంగారకుడున్న ఎడల ఆపదలు, చంద్రుడున్న ఎడల నానా దుఃఖములు, శని ఉన్న ఎడల స్త్రీల వలన భయము కలుగును.

శ్లో॥ *నౌధనేచ సహస్రాంశో విద్విషో జనితాపదః।*

*హానిశ్చ తమయూఖేచ భౌమే సౌరేచ రుగ్భయమ్॥*

లగ్నమునకు ఎనిమిదవ స్థానమున రవి ఉన్న ఎడల నానావిధ ఆపదలు కలుగును. చంద్రుడున్న ఎడల హానియు, అంగారక శనులున్న ఎడల రోగ భయములు కలుగును.

శ్లో॥ *బుధేష్టమే ధనప్రాప్తి ర్జీ వేచ విజయో భవేత్।*

*శుక్రే స్వజన భేదస్స్యా స్మంత్రజ్ఞ స్యాపి దేహినః॥*

లగ్నమున ఎనిమిదవ స్థానమున బుధుడున్న ఎడల ధనము, గురుడున్న ఎడల విజయము, శుక్రుడున్న ఎడల స్వజనభేదము కలుగును.

శ్లో॥ *వాగీశే నవమస్థానే విద్యాభోగాది నందనమ్।*

*బుధే వివిధభోగాని జీవేచ విజయో భవేత్॥*

లగ్నమునకు తొమ్మిదవ స్థానమున శుక్రుడున్న ఎడల విద్యాభోగాదులచే సంతోషము, బుధుడున్న ఎడల నానావిధ భోగములు కలుగును. గురుడున్న ఎడల విజయము కలుగును

శ్లో॥ చంద్రే ధాతుక్షయః ప్రోక్తో ధర్మహానిశ్చ భాస్కరే,
కుజే చార్థక్షయో విద్యాద్రవిజే ధర్మదూషణమ్॥

లగ్నమునకు తొమ్మిదవ స్థానమున చంద్రుడున్న ఎడల ద్రవ్య నష్టము, రవి ఉన్న ఎడల ధర్మహానీ, అంగారకుడున్న ఎడల అర్థహానీ, శనియున్న ఎడల సర్వకాలములందు ధర్మమును నిందుంచువానిగా చేయును.

శ్లో॥ దశమస్థానగే శుక్రే శయనాశన సిద్ధయః॥
సురాచార్య మహాత్సౌఖ్యం విజయం స్త్రీధనం బుధే॥

లగ్నమునకు పదవ స్థానమున శుక్రుడున్న ఎడల శయనాది సౌఖ్యములు. గురుడున్న ఎడల మహా సౌఖ్యములు, బుధుడున్న ఎడల విజయము, స్త్రీ ధనప్రాప్తి కలుగును.

శ్లో॥ మార్తాండే వసు వృద్ధ్వృద్ధిః చంద్రే శోక వివర్ధనం,
భౌమే రత్నాగమః ప్రోక్త కోణే కీర్తి విలోపనమ్॥

లగ్నమునకు పదవ స్థానమున రవి ఉన్న ఎడల ధనము, కులవృద్ధి, చంద్రుడున్న ఎడల శోకవృద్ధి, అంగారకుడున్న ఎడల ధనాగమము, శని ఉన్న ఎడల కీర్తి నాశనము కలుగును.

శ్లో॥ లాభస్థానేషు సర్వేషు లాభస్థాన వినిర్ది శేత్,
వ్యయస్థానేషు సర్వేషు వినిర్దిశ్యో వ్యయస్సదా॥

లగ్నమునకు పదకొండవ స్థానమున సకల గ్రహములున్న ఎడల నానావిధ లాభములు, పదిరెండవ స్థానమున సకల గ్రహములున్న ఎడల నానావిధ ధన నాశనములు కలుగును.

## మహా యోగములు

శ్లో॥ గురుర్లగ్నే రవిః షష్ఠే స్యూనే సౌమ్యే సుఖేస్థితే,
తృతీయస్థేర్క పుత్రేచ తద్గ్రహం శతమాయుషమ్॥

లగ్నమున గురువు, 6వ స్థానమున రవి, 7వ స్థానమున బుధుడును, 4వ స్థానమున శుక్రుడు, 8వ స్థానమున శని ఉండగా కట్టిన గృహమునకు నూరు సంవత్సరము లాయువు కలుగును.

శ్లో॥ *భృగుర్లగ్నే వరస్సౌమ్యే లాభస్థానేచ భాస్క రే।*

*గురుః కేంద్రగతో యత్ర శతవర్షాణి తిష్ఠతి॥*

లగ్నమున శుక్రుడు, 10వ స్థానమున బుధుడు 11వ స్థానమున రవియు, కేంద్రమున గురుడు ఉండగా కట్టిన గృహమునకు నూరు సంవత్సరము లాయువు కలుగును. లగ్నమున శుక్రుడు, 5వ స్థానమున గురుడు, 6వ స్థానమున అంగారకుడు, 3వ స్థానమున రవియు ఉండగా నిర్మించిన గృహము రెండు వందల సంవత్సరము లాయువు కలిగియుండును.

శ్లో॥ *స్వోచ్ఛస్థోవా భృగుర్ల గ్నే స్వోచ్ఛే జీవీ సుఖ స్థితే ।*

*స్వోచ్ఛే లాభగతే మందే సహస్రాణాం సమాస్థితిః॥*

శుక్రుడు ఉచ్ఛుడై లగ్నమునను, గురుడుచ్ఛుడై 4వ స్థానమునను, శని ఉచ్ఛుడై 11వ స్థానమునను ఉండగా నిర్మించిన గృహము వెయ్యి సంవత్సరము లాయువు కలదైయుండును.

## శంఖుస్థాపన నిషేధ సమయములు

శ్లో॥ *గురు భార్గవయోర్మౌఢ్యే బాల్య వార్ధక్యయో రపి।*

*చాతుర్మాస్యాం శూన్యమాసే గృహకర్మ న్నకారయేత్॥*

గురు శుక్రుల యొక్క మూఢత్వమందును, బాల్య వృద్ధత్వమందును అనగా 5 దినములు అస్తమించుననగా, 5 దినములు ఉదయమైన తర్వాత ఈ 10 దినముల పర్యంతమునూ నిషేధములు చాతుర్మాసములందును, శూన్యమాసములందును గృహనిర్మాణము చేయరాదు.

శ్లో॥ *వృద్ధౌ క్షయే వ్యాధి భయే రాజాటంక రజస్వలే।*

*చారే క్రూరే దుర్ముహూర్తే, శ్రాద్ధే మాసాంతికే తథా।*

*తస్మిన్ శంఖుం వినిక్షిప్య మృత్యుం హానిప్రదం భవేత్॥*

జాతాశౌచమునందును, మృతాశౌచమునందును, రోగము కలిగినపుడును, రాజులవలన ఆటంకము కలిగినపుడును, భార్య రజస్వల అయినపుడును, పాపగ్రహచారమందును, దుర్ముహూర్తమునందును గృహారంభము చేసిరేని మృత్యువుగాని, హానిగాని సంభవించును.

శ్లో॥ గృహారంభం గృహిణ్యాంతు గర్భిణ్యాంనైన కారయేత్,
యతి కుర్యాద్గర్భహానిః పత్నీపుత్రక్షయో భవేత్,
శంఖోస్సంస్థాపనం రాత్రౌ న కర్తవ్యం కదాచన,
యః కుర్యాత్కర్తహానిః పుత్రహాని ర్నసంశయః॥

భార్య గర్భవతి అయి ఉండగా గృహారంభము చేసిరేని గర్భహానియు, పత్నీక్షయము, పుత్రక్షయము కలుగును. రాత్రియందు శంఖుస్థాపన చేసిన ఎడల కర్తృహాని, పుత్రహాని కలుగును.

శ్లో॥ ఆసన్న ప్రసవే మాసి కుర్యాత్రైవ విశేషతః,
తద్వత్ప్రసవకాలేస్యా దితిశాస్త్రేమ నిశ్చయః॥

ఆసన్న ప్రసవమాసమందు గృహ నిర్మాణము చేయవచ్చునని శాస్త్రమందు చెప్పబడియెను. గాన, అట్టి కాలములో విచారించనవసరం లేదు.

శ్లో॥ మాసేతు నవమే ప్రాప్తే పూర్వ పక్షే శుభే దినే,
ప్రసూతి సంభవే కాలే గృహారంభణ మిష్యతే॥

గర్భముతో నుండిన భార్యకు 9వ మాసము వచ్చిన పిమ్మట పూర్వపక్షము నందలి శుభదినమందైనను, ప్రసూతికాలమందైనను గృహారంభము చేయవచ్చును.

## గృహప్రవేశ సమయములు

శ్లో॥ మాఘ ఫాల్గుణ వైశాఖే జేష్ఠమాసా శుభప్రదాః,
మహ ఊర్జేచ విజ్ఞేయా మాధ్యమాతు ప్రవేశనే॥

మాఘ, ఫాల్గుణ, వైశాఖ, జ్యేష్ఠ మాసములు శుభములు; కార్తీక, మార్గశిర మాసములు మధ్యమములని తెలియవలయును.

శ్లో॥ వైశాఖే బహుపుత్రదస్స్యు శుభదో జ్యేష్ఠేర్ధనం ఫాల్గునే,
మాఘే ధాన్య సుఖప్రదో గృహపతేర్మాసే ప్రవేశోభవేత్॥
ఆదిత్యే మకరాది షట్సు సహితే కుంభాఖ్య మాసం వినా,
సర్వాభీష్టద ఇత్యధాహురపరే శేషేద్వ్యయం దుఃఖదః॥

వైశాఖ మాసమున గృహ ప్రవేశము చేసిరేని బహుపుత్రలాభము కలుగును. జ్యేష్ఠ మాసమున శుభములు కలుగును. ఫాల్గుణ మాసమున సంపత్కరము, మాఘ

మాసమున సుఖము, ధాన్య లాభములు కలుగును. మరియు ఉత్తరాయణమున కుంభమాసము తప్ప తక్కిన మాసములలో గృహప్రవేశము చేసిన గృహపతికి సర్వాభీష్టములు కలుగును. కటక మాసము మొదలు 6 మాసములందు అశుభము కలుగును.

## నక్షత్ర ఫలములు

శ్లో॥ *చిత్రా మిత్ర వసూత్తరాంత్య వరుణ బ్రహ్మేందు తారాదశ*
*శ్రేష్ఠాస్యుర్నిలయ ప్రవేశ ఉడుమస్యాన్మధ్యమం పుష్యభం*
*తద్గేహం పరహస్త యాత మదితి స్వాత్యర్క రప్రాద్యుతే*
*రుద్రాగ్ని జ్వలన ప్రదౌచ గృహిణీ శేషాను దుఃఖప్రదా॥*

చిత్త, అనూరాధ, ధనిష్ట, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి, శతబిషం, రోహిణి, మృగశిర ఈ నక్షత్రములందు సుఖప్రదములు. పుష్యమి మధ్యమ ఫలము. పునర్వసు, స్వాతి, హస్త, అశ్వని, శ్రవణము ఈ నక్షత్రములందు గృహమన్యాక్రాంత మగును. ఆరుద్ర, కృత్తిక ఈ నక్షత్రములు అగ్నిభయము కలుగును. మిగిలిన నక్షత్రములు గృహపతికి దుఃఖములు కలిగించును.

## వార ఫలములు

శ్లో॥ *చంద్రసౌమ్య గురు శుక్ర వాసరేశ్రీకరస్సుతమహార్థలాభదః*
*సూర్య సూను దివసే స్థిరప్రదః మపి చోరభయ మవిద్య తే॥*

సోమ, గురు, బుధ, శుక్రవారములందు గృహప్రవేశం జరిగిన సంపదయు, పుత్ర ధనవృద్ధులు కలుగును. శనివారమునందు స్థిరత్వము కలుగునుగాని, దొంగలవలన భయము కలుగనేరదు.

## తిథి ఫలములు

శ్లో॥ *రిక్తాపదశ్శూన్యతిథిర్దినేశ, భూసూనుషడ్వర్గమినేందుదృష్టిం।*
*క్రూరగ్రహాధిష్ఠిత విద్ధభంచ, విసర్జనీయం త్రివిధం ప్రవేశే॥*

రిక్త తిధులును, చతుర్థశియును, దినత్రయమును, శూన్యతిధులును, సూర్య అంగారక షడ్వర్గులును, సూర్యచంద్రుల దృష్టి కలిగినటువంటిన్నీ; క్రూరగ్రహములు ప్రవేశించకపోవు నక్షత్రములును, ఇలాంటి తిధి, షడ్వర్గ నక్షత్రములు గృహప్రవేశమునకు విడిచి పెట్టవలెను.

## లగ్న ఫలములు

శ్లో॥ భూయే యాత్రాభవే న్మేషే నాశం కర్కటకేపివా,
వ్యాధిం తులాదరే లగ్నే మకరే ధాన్య నాశనమ్॥

మేష లగ్నమున గృహప్రవేశము చేసిన మాటిమాటికి యాత్రలు చేయించును. కర్కాటక లగ్నమున నాశనము కలుగును. తులాలగ్నమున వ్యాధులు కలుగును. మకర లగ్నమున ధాన్యాదులకు నాశనము కలుగును.

శ్లో॥ పాపః పాపయు తేక్షి తోష్టమ గతః పాపాలయస్థోథవా
వర్షాచ్ఛేచ్ఛుభవీక్షితోష్టగుణతో హన్యాద్గృహస్వామినమ్॥
క్షీణేందుశ్చ భడష్టరిప్ప గృహగచ్ఛే త్సన్ని వేశాలయా
ద్ధన్యాత్కర్తృకళత్ర మాశు నివిశేల్ల గ్నేవిశుద్ధేష్టమే॥

ఒక పాపగ్రహము మరొక పాపగ్రహముచే చూడబడుచున్నను, పాప గ్రహముతో కూడినను, పాపగ్రహరాశి పొందినను, ప్రవేశలగ్నమునకు 8వ స్థానమున నుండెనేని ఒక సంవత్సరము పిదప ఆ గృహపతి భార్య వైధవ్యము నొందును. పాపగ్రహము, శుభగ్రహముచే చూడబడుచున్నను, ప్రవేశ లగ్నమునకు 8 వ స్థానమున ఉన్న ఎడల సంవత్సరము పిదప ముందు చెప్పిన దుష్ఫలము కలుగును. క్షీణచంద్రుడు 6, 8, 12 స్థానములలో ఉన్న ఎడల గృహపతి అపత్నీకుడగును. కాన, 8వ స్థానమున ఏ గ్రహము ఉండరాదు. మరియు (ప్రవేశే ద్వాదశే శుద్ధి-అనుటచేత) గృహప్రవేశ లగ్నమునకు అష్టమశుద్ధియేగాక ద్వాదశశుద్ధి కూడా ఉండవలెను. అనగా గ్రహములు లేక ఉండుట.

శ్లో॥ ప్రవేశే ద్వాదశే శుద్ధి పట్టమేకాదశస్థితా
ప్రాశనం దశమం శుద్ధి నవసీమంత చౌలయోః
ఉపనీతుం చాష్టమంచ వివాహంచైవ సప్తమే
షష్ఠేతు నవవస్త్రాణి ప్రయాణంచైవ పంచమే
చతుర్థే శత్రుసంయోగం తృతీయే రాజదర్శనం
ద్వితీయే ధననిక్షేపం లగ్నం స్త్రీసంగమం తథా॥

గృహప్రవేశ లగ్నమునకు 12వ స్థానము శుద్ధియు, పట్టాభిషేకమునకు 11వ స్థానము శుద్ధియు, అన్నప్రాశనకు 10వ స్థానము శుద్ధియు, సీమంత, చౌళములకు 9వ స్థానము శుద్ధియు, ఉపనయనమునకు 8వ స్థానము శుద్ధియు, వివాహమునకు

7వ స్థానము శుద్ధియు, నూతన వస్త్రధారణకు 6వ స్థానము శుద్ధియు, ప్రయాణమునకు 5వ స్థానము శుద్ధియు శత్రుదర్శనమునకు 4వ స్థానము శుద్ధియు, రాజదర్శనమునకు 3వ స్థానము శుద్ధియు, ధననిక్షేపము అనగా ఇనుపపెట్టెలో ధనము దాచుటకు 2వ స్థానము శుద్ధియు, స్త్రీ సాంగత్యమునకు లగ్న శుద్ధియు ఉండవలెను.

శ్లో॥ *అష్టమస్థే నిశానాథే యది యోగశతైరపి।*

*తదా తే నిష్ఫలాజ్ఞేయా వృక్షా వజ్రహతా ఇవ।*

*క్షీణచంద్రోంత్య షష్ఠాష్ట సంస్థితో లగ్నతస్తథా।*

*భార్యా వినాశనం వర్షా త్సౌమ్యయుక్త త్రివర్షత:*

చంద్రుడు అష్టమ స్థానమున ఉండెనేని నూరుపయోగములు ఉన్నను ప్రయోజనము లేదని తెలియవలెను. అలా ఉండెనేని పిడుగు పడిన వృక్షమువలె దగ్ధమై పోవును. క్షీణచంద్రుడు 6, 8, 12, స్థానముల యందున్నప్పుడు మూడు సంవత్సరముల లోపల భార్య నష్టపోవును. మరియు గృహపతి లగ్నమునకు గాని, ప్రవేశ లగ్నమునకు గాని చంద్రుడు 8, 12 స్థానముల యందు ఉండుట-బహు పాపిగాన చంద్రస్థితిని బాగుగా పరిశీలన చేసికొనవలెను

శ్లో॥ *జన్మభే జన్మలగ్నేవా తాభ్యాముపచయేపివా।*

*ప్రవేశ: పుత్ర ధనద స్త్వన్యథా శోక హానిదా।*

జన్మ లగ్నమందైనను, జన్మ నక్షత్రమందైనను వాటికి ఉపచయములు 3, 6, 11 స్థానములైనను గృహప్రవేశమునకు చాలా మంచిది. అన్యథా జన్మనక్షత్ర లగ్నములకు మరియొక్క నక్షత్రములైన ఎడల హాని, శోకము కలుగును.

శ్లో॥ *సిద్ధికృత్ ధనకృచ్ఛేవా భయకృత్ జన్మరాశిత:॥*

జన్మరాశి యందు జరిగిన గృహప్రవేశము, సర్వకార్య ధనసిద్ధియు, భయనాశనము కలుగచేయును.

శ్లో॥ *దివాప్రవేశశ్శుభ దస్సుపుత్ర: పౌత్రాభివృద్ధేర్ని శిభాస్కరేందో:*

*భవేనమత్స్యధ్వజవాసరస్య రాత్రింవినాసూర్య తిథిశ్చరాత్రిమ్॥*

గృహప్రవేశము పగటివేళ చేసిన పుత్రపౌత్రాభివృద్ధి కలుగచేయును. రవి, బలయుక్తమగు రాత్రి శుభము కలుగచేయును. రవి, చంద్రులు బలము లేని రాత్రి యందును, శనివారము నందున నూతన గృహప్రవేశము చేయరాదు.

## గృహపతి జన్మరాశి ఫలములు

శ్లో॥ *వ్యాధిహా ధనహాచైవ విత్తదా బంధు నాశకృత్।*
*పుత్రహా శతృహాస్త్రీఘ్నం ప్రాణహా పిటకప్రదః।*
*సిద్ధిదో ధనదశ్చైవ భయకృజ్జన్మరాశితః॥*

గృహపతి జన్మరాశి యందు గృహప్రవేశమైన వ్యాధిని పొగొట్టును. 2వ రాశియైన ధననాశనము, 3 వ రాశయైన ధనవృద్ధి, 4వ రాశియైన బంధు నాశనము, 5వ రాశియైన పుత్రహాని, 6వ రాశియైన శత్రుహాని, 7వ రాశియైన స్త్రీ హాని, 8వ రాశియైన ప్రాణహాని, 9వ రాశియైన పిటక ప్రదము (అనగా బొబ్బరోగము), 10వ రాశియైన సిద్ధియు, 11వ రాశియైన ధనము వృద్ధి, 12వ రాశియైన భయము కలుగును.

## గృహ ప్రవేశ నిషేధ కాలము

శ్లో॥ *యావచ్చంద్రేణ భుక్తం తదృక్షౌ నైవతు శోభనమ్।*
*జన్మఖా ద్దశమం కర్మ సంఘారంతు షోడశమ్॥*
*అష్టాదశం సాముదాయం త్రయోవింశం వినాశకమ్।*
*మానసం పంచవింశాఖ్యం నాచరే దేమ శోభనమ్॥*

చంద్రునిచే భుక్తమైన నక్షత్రమున అశుభము కలుగును. జన్మనక్షత్రమునకు 10వ నక్షత్రము కర్మసంఘాతము; 16వ నక్షత్రము, 18 వ నక్షత్రము సాముదాయకము; 23వ నక్షత్రము వినాశనము; 25వ నక్షత్రము మానసము కనుక, ఈ నక్షత్రముల యందు ప్రవేశము చేయరాదు.

శ్లో॥ *అకవాట మవాచ్ఛన్న మదత్త బలిభోజనమ్।*
*గృహాన్నప్రవిశే దేవం విపదామాకరంహి తత్॥*

తలుపులు పెట్టక, పైకప్పు వేయక, బలిహరణ భోజనములు పెట్టక గృహ ప్రవేశము చేయరాదు అలా చేసిరేని ఆ గృహమున ఆపదలు కలుగును.

## తారాబల క్రమము

శ్లో॥ *జన్మ నక్షత్ర మారభ్య నిత్య నక్షత్ర గణ్యతే।*
*నవసంఖ్యా హారద్భాగం నవ తారా ప్రకీర్తితా॥*

జన్మనక్షత్రము మొదలు నిత్యనక్షత్రమువరకు లెక్క పెట్టిన నక్షత్ర సంఖ్యను 9చే భాగించగా వచ్చిన సంఖ్యను తారాబలముగా ఎంచుకొనవలెను.

శ్లో॥ జన్మ సంప ద్విప క్షేమ ప్రత్యక్సాధన నైధనం।
మిత్రం పరమమైత్రంచ నవతారాః ప్రకీర్తితాః॥

1. జన్మతార-ఆయాసము
2. సంపత్తార-సంపద
3. విపత్తార-ఆపత్తు
4. క్షేమతార-క్షేమము
5.ప్రత్యక్తార-కార్యనాశనము
6. సాధనతార-కార్యసాధనము
7. నైధనతార-మరణము
8. మిత్రతార-శుభము
9. పరమమైత్రతార-సుఖము

ఈ విధముగా తారాబలము చూచుకొనవలెను. దుష్టతారల దోషపరిహారము కొరకు జన్మతారకు శాకము; విపత్తారకు బెల్లము; ప్రత్యక్తారకు ఉప్పు; నైధనతారకు బంగారము, నువ్వులు-సౌఖ్యము కొరకు దానము చేయవలెను.

## చంద్ర బల క్రమము

శ్లో॥ *జన్మానల ఋతౌ సప్త దశమైకాదశే శుభః।*
*చతుర్థ ద్వాదశే కృష్ణే శుక్లే ద్వి నవ పంచమే।*
*యథా మాతా సుతాన్‌రక్ష తథా రక్షతు చంద్రమా॥*

చంద్రుడు, లగ్నము మొదలు 1, 3, 6, 7, 10, 11 స్థానములయందు శుభుడగును. కృష్ణపక్షమున 4, 12 స్థానములయందు శుభుడగును. శుక్ల పక్షమున 2, 5, 9 స్థానముల యందు శుభుడగును. తల్లి బిడ్డను ఎలా రక్షించునో ఆ ప్రకారముగ చంద్రుడు రక్షణ చేయుచుండును.

## పంచకరహిత క్రమము

శ్లో॥ *తిథిఉడుదిన లగ్న మిశ్రితం పంచధా కృ*
*త్రిథిః రవి దశ నాగైర్వేద సంఖ్యాయుతం యత్।*
*నవహృత శరశేషం శోభనే వర్జనీయం।*
*రుగనల నృపచోరై ర్మృత్యునా దూషితంచ॥*

శుక్ల ప్రతిపదాతిథి, అశ్వనీ నక్షత్రము, సూర్యవారము, మేషలగ్నమునుండి వర్తమాన తిథి, నక్షత్రము, వారము లగ్నము వరకు లెక్కించి మొత్తమును 5 సమభాగములుగా

విభజించవలెను. ఒక్కొక్క భాగమునకు 15, 12, 10, 8, 4 క్రమముగా కలుపవలెను. అట్లుకలిపిన ప్రతిభాగ మొత్తపు సంఖ్యను 9చే భాగించగా 5 శేషము మిగులని ఎడల పంచకరహితమని తెలియవలెను ఐదు భాగములలో ఏ భాగమునందైనను 5 శేషము మిగిలిన ఎడల పంచకరహితము కాలేదని అర్థము

1 వ భాగములో 5 శేషము మిగిలిన రోగ పంచకము.

2 వ భాగములో 5 శేషము మిగిలిన అగ్ని పంచకము.

3 వ భాగములో 5 శేషము మిగిలిన రాజ పంచకము.

4 వ భాగములో 5 శేషము మిగిలిన చోర పంచకము.

5 వ భాగములో 5 శేషము మిగిలిన మృత్యు పంచకము అని తెలియవలెను.

## పక్షాంతర పంచక రహిత క్రమము

శ్లో॥ *తిథి వారభ లగ్నానాం యోగో నవభిరుద్ధృతః।*
*ఏక ద్వి వేద షణ్ణాగ మితే శేషే క్రమేణతు।*
*మృత్యుం వహ్నించ రాజంచ చోరం రోగం త్యజేత్శుభే॥*

గత తిధి, వార, నక్షత్ర, లగ్నముల వరకు లెక్కించి కలపిన మొత్తమును, 9 చే భాగించగా శేషము ఒకటి వచ్చిన మృత్యుపంచకము, శేషము రెండు వచ్చిన అగ్ని పంచకము శేషము నాలుగు వచ్చిన రాజ పంచకము, శేషము ఆరు వచ్చిన చోర పంచకము, శేషము ఎనిమిది వచ్చిన రోగ పంచకము అని తెలుసుకోవలెను. వీటిని శుభకర్మలకు ఉపయోగించరాదు.

## లగ్న ప్రమాణములు

శ్లో॥ *మేషే వారిదయః ఖలోచనమితర్నాడీ వినాడ్యో వృషే*
*వేదాస్త్రర్క శరాన్నృయుగ్మ భవనే బాణాస్తథా షడ్యమాః।*
*పంచందగ్నిమితాః కులీరభవనే సింహే శరాః ఖాశ్వినః।*
*కన్యా సద్మని సాయకా శరభువో జూకే శృరాసుర్దినాః।*
*కౌర్పాఖ్యే భవనే శరాః పురగుణా కోదండభే మారుతా।*
*గోచంద్రా మకరేభ్దయో గుణకృతాః కుంభేబ్ద యశ్చంకరా।*
*మీనేవారిధయోయమా ప్రమితయో హ్యేతేస్వదేశోద్భవా।*
*లగ్నానాసు దినా ప్రమాణఘటికాః కార్తాంతికైర్నిశ్చితా॥*

| | | |
|---|---|---|
| మేషము 4-20 | సింహము 5-20 | ధనుస్సు 5-19 |
| వృషభము 4-56 | కన్య 5-15 | మకరము 4-43 |
| మిధునము 5-26 | తుల 4-24 | కుంభము 4-11 |
| కర్కాటకము 5-31 | వృశ్చికము 5-33 | మీనము 4-20 |

ఈ లగ్న ప్రమాణ ఘడియ, విఘడియలు ఏ ప్రాంతమందైనను అన్ని కాలములలో వాడుకొనవచ్చును. కొన్ని ప్రాంతములలో కొద్ది తేడా ఉండును. అయినను సందేహము లేకుండా వాడవచ్చును.

## పుష్కర ప్రమాణము

| | | |
|---|---|---|
| శ్లో॥ మేషద్వయ చాష్టతాళం | ఘ | 2-48 |
| వృషభేద్వేచ షష్టకం | ఘ | 2-06 |
| మిధునే చతురం భారం | ఘ | 4-12 |
| కర్కటేకంచ సప్తదశే | ఘ | 1-17 |
| సింహత్రయం ఏకపన్నం | ఘ | 3-51 |
| కన్యా ద్వే సప్తవింశతి | ఘ | 2-27 |
| తులాయా చతురం భారం | ఘ | 4-12 |
| వృశ్చికేకంచ సప్తదశే | ఘ | 1-17 |
| ధనుస్త్రయం ఏకపన్నం | ఘ | 3-51 |
| మకరే ద్వే సప్తవింశతి | ఘ | 2-27 |
| కుంభత్రయం షట్‌త్రింశత్ | ఘ | 3-36 |
| మీనే కప్పన్న పుష్కరాః | ఘ | 0-51 |

ఈ విధముగా ఘడియ, విఘడియలు పుష్కరకాలము ఉండునని తెలియవలెను

## జీర్ణ గృహ ప్రవేశము

శ్లో॥ జీర్ణే గృహేగ్న్యాది భయాన్న వేపి
మాగోర్జయోశ్శ్రావణకేపి సత్స్యాత్।
వేశోంబుపేజ్యా నిల వాసవేషు।
పూర్వోక్త మాసాది విచారణాత్ర॥

జీర్ణ గృహమును బాగుచేసి (నూతన గృహముగా చేసి) శతభిషము, పుష్యమి, స్వాతి, జ్యేష్ఠ నక్షత్రముల యందును, ఆశ్వీయుజ, కార్తీక, శ్రావణ మాసముల యందును, పూర్వోక్త మాసములయందును ప్రవేశించవచ్చును. ఇట్టి ప్రవేశమునందు శుక్రహస్తాది దోషములు లేవు. మరియు....

శ్లో॥ *నిర్గమాన్నవమే వర్షే మాసేచ దివసేపివా।*
*ప్రవేశో నిర్గమశ్చైవ నకుర్యాత్త్ర త్కదాచన॥*

గృహమును వదలి వెళ్ళిన పిమ్మట మరల ప్రవేశించువారు 9వ సంవత్సరమందు, 9వ మాసమందు, 9వ దినమందు గృహప్రవేశము జేయరాదు.

## అభిజిత్తు నక్షత్ర క్రమము

శ్లో॥ *అంత్యో వైశ్వశ్చతుర్థాంశ శ్రవః పంచదశాంశకః।*
*ఆద్యన్తయోర్యుతిర్యాసా త్వాభిజి త్పరికీర్తితా॥*

ఉత్తరాషాఢ నక్షత్రము యొక్క చతుర్థపాదము, శ్రవణ నక్షత్రము యొక్క ప్రథమ పాదములో ప్రథమ నాలుగు ఘడియలు కలుపుకొనగా మొత్తము ఘడియలను అభిజిత్తు నక్షత్రముగా భావించుకొనవలెను.

శ్లో॥ *ప్రాశ్చాత్యానాం కళింగానాం ముఖ్య గోధూళికం స్మృతః।*
*అభిజ త్సర్వదేశేషు ముఖ్యం దోష వినాశకృత్॥*

ప్రాశ్చ్యదేశము, కళింగ దేశము గాక, మిగిలిన దేశములకు అభిజిత్తును ముఖ్యముగా వాడుకొనవచ్చును దోషము లేదు.

## కలశ చక్ర క్రమము

శ్లో॥ *చక్రంస్యా త్కలశ స్వరూప మథతత్సంలిఖ్యమూర్ధేకభం।*
*ప్రాగాద్యాసు చతుశ్చతుః ప్రతిదిశం చత్వారి తన్మధ్యమే।*
*కంఠేత్రీణితథోత్రయంచ లిఖితే ద్వానాంక్రమం తత్ఫలం।*
*వక్ష్యార్కా న్వితభాదితశ్చగణయే త్సంవేశదిష్ట్వాతతః।*
*శీర్షచ్ఛేదమథప్రవాస మభయం ధాన్యం తతోనిర్ధనం।*
*గర్భస్రావమథస్త్రియం గృహపతే ర్ధ ద్వ్యాచ్ఛతాయుస్సదా।*

సంగ్రామాఖిల దుర్గ శైల నగర ప్రాసాద దేవాలయః।

క్షేత్రారామ గృహప్రవేశసమయేజ్ఞేయం హి చక్రద్వయమ్॥

కలశాకారము గల ఒక చక్రము గీచి శ్లోకములో ఉదహరించిన ప్రకారము రవి మొదలు 27 నక్షత్రములను ఆయా స్థానములలో వ్రాయవలెను. అట్లు వ్రాయగా గృహప్రవేశ నక్షత్రము చక్రమునకు శిరస్సునందున్న గృహపతి శిరచ్ఛేదనము, తూర్పు భాగ నాలుగు నక్షత్రములలో ఒకటైన పరదేశ గమనము, దక్షిణ భాగ నాలుగు నక్షత్రములలో ఒకటైన ధైర్యము, పశ్చిమ భాగ నాలుగు నక్షత్రములలో ఒకటైన ధాన్య లాభము, ఉత్తర భాగ నాలుగు నక్షత్రములలో ఒకటైన దరిద్రము, మధ్య భాగ నాలుగు నక్షత్రములలో ఒకటైన గృహపతి భార్యకు గర్భస్రావ దోషము, కంఠస్థానము నందు మూడు నక్షత్రములలో ఒకటైన సంపద, అడుగు భాగమున మూడు నక్షత్రములలో ఒకటైన పూర్ణాయువు గలుగును.

## వృషభ చక్ర క్రమము

శ్లో॥ వృషచక్రం వృషాకారం సర్వావయవ సంయుతం।
యస్మిన్నృక్షే స్థితో భాను స్తత్రాదౌ త్రీణి మస్తకే
అగ్రపాదేతు చత్వారి పున శ్చత్వారి పశ్చిమే।
పృ ష్ఠే త్రీణీచ దిష్ట్యాణి కుక్షౌ చత్వారి దక్షిణే
పుచ్ఛే త్రీణీచ దిష్ట్యాణి కుక్షౌ చత్వారి వామకే।
ముఖే త్రీణీచ దిష్ట్యాణి అష్టవింశతి తారకాః।

శ్లో॥ శిరసా వజ్రపాతస్స్యా దుద్వేగశ్చాగ్రపాదయో
స్థిరతం పశ్చిమోపాదే పృష్ఠేచైవ ధనాగమః।
దక్షిణాక్షౌ జయోలాభః పుచ్ఛే స్వామి వినాశనమ్।
వామ కుక్షౌచ దారిద్ర్యం ముఖే పీడా నిరంతరమ్।
భాత్తు త్యజేత్సప్తదశ తతశ్చే కాదశే ధనం।
తతోన్యభేసు దుష్టంస్యాత్ ఇతివాస్తు ప్రకీర్తితమ్॥

వృషభాకారము గల చక్రము గీచి దాని అవయవముల యందు శ్లోకములో ఉదహరించిన ప్రకారము రవి మొదలు అభిజిత్తుతో 28 నక్షత్రములను వ్రాయవలెను. గృహప్రవేశ నక్షత్రము శిరస్సునందు మూడు నక్షత్రములలో ఒకటైన మృత్యువు, ముందు పాదముల నాలుగు నక్షత్రములలో ఒకటైన దురవస్థ, వెనుక పాదముల నాలుగు నక్షత్రములలో ఒకటైన స్థిరత్వము, పృష్ఠ భాగమున మూడు నక్షత్రములలో ఒకటైన ధనాగమము, దక్షిణ భాగమున నాలుగు నక్షత్రములలో ఒకటైన జయము, లాభము, తోక యందు మూడు నక్షత్రములలో ఒకటైన వినాశనము, ఉత్తర భాగములో నాలుగు నక్షత్రములలో ఒకటైన దరిద్రము, ముఖమునందు మూడునక్షత్రములలో ఒకటైన పీడయు గలుగును. అనగా రవి మొదలు మొదటి తొమ్మిది నక్షత్రములను, చివరి ఎనిమిది నక్షత్రములను విసర్జించవలెను. ఈ రెండు కలశ, వృషభ చక్రములను యుద్ధ, దుర్గ, పర్వత, పుర, సౌధ, దేవాలయ, కృషి, భూమి, ఉద్యానవన గృహప్రవేశము మొదలగు వాటియందు చూడవలెను.

# తొమ్మిదవ అధ్యాయము

## అనుభవ ముహూర్తాంశములు

శంఖుస్థాపన, గృహప్రవేశములందు ముహూర్తములు నిర్ణయించునప్పుడు లగ్నమునకు నక్షత్రము యొక్క గ్రహబలములను ఉదహరించుచున్నాను.

అనగా ఒక నక్షత్ర తారాబలము కుదిరినపుడు ఆ నక్షత్రము యొక్క దశా నాధుడు బలవంతుడైనపుడే ఆ లగ్నము బలమై గృహాది శుభకార్యములు జయప్రదముగా యోగించును. శుభగ్రహములు కేంద్రములయందును, పాపగ్రహములు 3, 6, 11 స్థానముల యందున్న మాత్రమున గృహవసతికి మేలు కలుగదు. కారణం నక్షత్ర దశానాధుడు, 8, 12 స్థానముల యందుండెనేని అరిష్టములు తప్పక ప్రాప్తించును నక్షత్రనాధుడు మంచి స్థానముల యందున్నపుడు కర్తకు అంగబలము, అర్ధబలము లేకపోయినను ప్రారంభముచేసిన కార్యము, నిర్మాణములు అత్యద్భుతముగా నెరవేరును. ఈ విమర్శన జాతకభాగ మనుభవనీయులకే తెలియునుగాని, తిధి వారాది నక్షత్రములు, పంచాంగములు శ్రవణము చేయునంతటితో తెలియవు. కాన, జాగ్రత్తగా పరిశీలనచేయు పాఠకులకు అనుభవమునకు వచ్చును.

## మేష లగ్నము

మేషలగ్నమున గృహారంభము, గృహప్రవేశములకు ముహూర్తము నిర్ణయమైనపుడు అశ్వనీ, మఘ, మూల- ఈ మూడు నక్షత్రములకు కేతువు దశానాధుడుగాన, ఈ కేతువు లగ్నమునకు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని కార్యసాఫల్యం, ఆరోగ్యం, సౌఖ్యం, రాజ్యలాభం, విశేష ధనప్రాప్తి కలుగజేయును. 1, 2, 4, 5, 7, 8, 9, 12 స్థానములయందు కేతువు ఉండెనేని భీతి, శరీర బాధ, కలహము, ద్రవ్యనష్టము, భయము, రోగము, చోరము, వైరాగ్యము మొదలగునవి కలుగజేయును.

ఉత్తర, ఉత్తరాషాడ నక్షత్రములకు సూర్యుడు దశానాధుడు. ఈ సూర్యుడు మేష లగ్నమునకు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని అద్భుత ద్రవ్యప్రాప్తి, కార్యజయము, ప్రభువువల్ల సౌఖ్యము, వ్యాపారలాభము కలుగజేయును. 1, 2, 4, 5, 7, 8, 9, 12 స్థానముల యందుండెనేని అగ్నిభయము, ధననష్టము, హృదయ

బాధ, గృహచ్ఛిద్రము, కళత్రరోగము, రాజ్యనష్టము మొదలగు దుర్గుణములు కలుగును. 5వ స్థానము స్వస్థానమగుటవల్ల ఉదాసీనము.

రోహిణి, హస్త, శ్రవణ నక్షత్రములలో హస్త గృహప్రవేశమునకు షష్టస్థిత చంద్రదోషము, కళత్రపీడ కలుగజేయును. కాన హస్త వదలవలెను. ఈ నక్షత్రమునకు చంద్రుడు దశానాధుడు. ఈ చంద్రుడు లగ్నమునకు 2, 10 స్థానముల యందుండెనేని సకల సౌఖ్యము, ధనము, ఆరోగ్యము, రాచకార్య లాభము కలుగజేయును.

మృగశిర, చిత్త, ధనిష్ఠ నక్షత్రములలో చిత్త నక్షత్రము యొక్క 1, 2 పాదములు షష్టస్థిత చంద్రదోషము, కళత్రపీడ కలుగజేయును. ఈ నక్షత్రములకు కుజుడు దశానాధుడు. ఈ కుజుడు లగ్నమునకు 3, 6, 11 స్థానముల యందుడెనేని ద్రవ్య లాభము, శతృజయము, సకలకార్యసిద్ధి కలుగును. 5, 9, 10 స్థానముల యందుండెనేని అగ్ని, రోగ, క్లేశ భయము, పుత్ర అనారోగ్యము, వజ్రదూషితము, ద్రవ్యనష్టము, దేశాంతర వాసము కలుగజేయును.

స్వాతి, శతభిష నక్షత్రములకు రాహువు దశానాధుడు. ఈ రాహువు లగ్నమునకు 2, 3, 6, 11 స్థానముల యందుండెనేని అఖండ దశ, సుఖము, శతృజయము, సర్వ కార్యలాభము కలుగజేయును. 1, 4, 5, 7, 8, 9, 10, 12 స్థానముల యందుండెనేని భీతి, రోగము, అర్థనాశనము, కలహము, అపమృత్యువు, నాశనము, రాజ్య కలహము మొదలగు నష్టములు కలుగును.

పునర్వసు నక్షత్రమునకు గురుడు దశానాధుడు. ఈ గురుడు లగ్నమునకు 1, 2, 4, 5, 7, 9, 10, 11 స్థానముల యందుండెనేని గమనము, ద్రవ్యప్రాప్తి, సుఖము, పుత్రప్రాప్తి, రాజ్యలాభము, భాగ్యవృద్ధి, స్వప్రభువువలన సర్వ కార్యలాభములు మొదలగు శుభ ఫలములు కలుగజేయును. 3, 6, 8, 12 స్థానముల యందుండెనేని ఆపత్తు, శత్రువృద్ధి, నాశనము, ధననష్టము సంభవించును.

పుష్యమి నక్షత్రమునకు శని దశానాధుడు. ఈ శని లగ్నమునకు 3, 6, 11 స్థానముల యందుండెనేని కార్యసిద్ధి, ధనధాన్య లాభము, ఇష్ట కార్యసిద్ధి కలుగును. 1, 2, 4, 7, 8, 9, 12 స్థానముల యందుండెనేని మతిభ్రమ, కార్యనష్టము, దేహపీడ, ప్రాణభయము, సర్వకార్య నాశనము చేయును. 5, 9, 10 స్థానముల యందుండెనేని మధ్యమ మిశ్రమ, ఫలములు కలుగును. ఈ మేషలగ్న ముహూర్తములకు పైనుదహరించిన నక్షత్రములు తప్ప మిగిలిన నక్షత్రములు పనిచేయవు.

# వృషభ లగ్నము

మఘా నక్షత్రమునకు కేతువు దశానాధుడు. ఈ వృషభలగ్నమునకు కేతువు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని ద్రవ్యలాభము, సంతోషము, సౌఖ్యము, రాజ్యలాభము, సర్వకార్యలాభము కలుగజేయును. 1, 2, 4, 7, 8, 12 స్థానముల యందుండెనేని శత్రుభీతి, అరిష్టము, గృహచ్ఛిద్రము, హాని, మృత్యువు, సర్వనాశనం చేయును. 5, 9 స్థానాల యందుండెనేని మధ్యమ ఫలములు కలుగజేయును.

ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్రములలో - ఉత్తరాషాఢ నక్షత్ర ప్రధమ పాదము అష్టమ స్థిత చంద్రదోషము కలుగుజేయును. ఈ నక్షత్రమునకు రవి దశానాధుడు. వృషభ లగ్నమునకు రవి 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని విజయము. ధనలాభము, రాజ్యలాభము, సర్వ కార్యసిద్ధి కలుగజేయును. 2, 4, 9 స్థానముల యందుండెనేని మధ్యమ ఫలములు కలుగును. 1, 5, 7, 8, 12 స్థానముల యందుండెనేని అగ్నిభయము, విపత్తు, వజ్రదూషితము, ఆత్మనాశనము, నకల కష్టములు గలుగజేయును.

రోహిణి, హస్త, శ్రవణ నక్షత్రములకు చంద్రుడు దశానాధుడు. ఈ చంద్రుడు 1, 5, 9 స్థానముల యందుండెనేని క్షేత్రవృద్ధి, పుత్రవృద్ధి, భాగ్యవృద్ధి మొదలగు సుగుణములు కలుగజేయును.

మృగశిర నక్షత్ర 1, 2 పాదములకు ద్వాదశాధిపత్య దోషము గలదు. చిత్తా నక్షత్రము 3, 4 పాదములు గృహప్రవేశమునకు షష్టస్థిత చంద్రదోషము కలుగజేయును. ఈ పాదములు పనిచేయవు. పై నక్షత్రముల మిగిలిన పాదములకు, ధనిష్టా నక్షత్రమునకు కుజుడు దశానాధుడు. ఈ కుజుడు వృషభ లగ్నమునకు 3, 6, 11 స్థానముల యందుండెనేని ద్వాదశ షష్టాధిపత్యము పోయి శతృ నాశనము, జ్ఞాతులవల్ల లాభము, భూ లాభము కలుగజేయును. 1, 2, 4, 5, 7, 8, 9, 12 స్థానముల యందుండెనేని కష్ట నష్టములు కలుగజేయును. 10వ స్థానమున వుండెనేని త్రిప్పట కలుగును.

స్వాతి నక్షత్రము గృహప్రవేశమునకు పనికిరాదు. షష్టస్థిత చంద్రదోషము పట్టును. కళత్రపీడ కలుగును. పై నక్షత్రమునకు, శతభిష నక్షత్రమునకు రాహువు దశానాధుడు ఈ రాహువు వృషభ లగ్నమునకు 3, 6, 10, 11 స్థానములందు ఉండెనేని సుఖము, శత్రుజయము, ధనలాభము, రాజ్యలాభము, సకలకార్యసిద్ధులు కలుగజేయును. 1, 4, 5, 7, 8, 9, 12 స్థానముల యందుండెనేని ప్రధమారిష్టము, క్షేత్ర నష్టము, పుత్రరోగము, రాజ్యహాని, ఆత్మహాని, భాగ్యహీనత, సకల నష్టములు కలుగజేయును.

పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర నక్షత్రములకు శని దశానాధుడు. ఈ శని వృషభ లగ్నమునకు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని ధనలాభము, శత్రుజయము, రాజ్యలాభము, సర్వలాభములు కలుగజేయును. 1, 2, 4, 5, 7, 8, 9, 12 స్థానముల యందుండెనేని నాశనము, అకారణ ధనక్షయము, క్షేత్రనాశనము, కళత్రపీడ, సకల నష్టములు కలుగజేయును.

రేవతి నక్షత్రమునకు బుధుడు దశానాధుడు. ఈ బుధుడు వృషభ లగ్నమునకు 1, 2, 3, 5, 7, 9, 10, 11 స్థానముల యందుండెనేని అకాల భోజనము, ధనలాభము, ఉల్లాసము, ధాన్యలాభము, ధైర్యము, సర్వ సౌఖ్యములు కలుగజేయును. 4, 6, 8, 12 స్థానముల యందుండెనేని ప్రధమ విఘ్నము, శత్రుభయము, సర్వనష్టములు కలుగజేయును.

## మిధున లగ్నము

మిధునలగ్నమున గృహారంభ, గృహప్రవేశములకు ముహూర్తములు పెట్టినపుడు నక్షత్ర గ్రహ దశాఫలములు క్రింది విధముగా చూడవలెను. అశ్వని, మఘ, మూల నక్షత్రములకు కేతువు దశానాధుడు. మిధున లగ్నమునకు ఈ కేతువు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని కార్యసిద్ధి, ధనలాభము, రాచకార్యసిద్ధి, సకల సౌఖ్యములు కలుగజేయును. 4, 5, 9 స్థానముల యందుండెనేని మధ్యమ ఫలములు, 1, 2, 7, 8, 12 స్థానముల యందుండెనేని మనోభీతి, ఆపత్తు, రాజదండన, ప్రాణభీతి, సర్వ నష్టములు కలుగజేయును.

ఉత్తర నక్షత్రమునకు రవి దశానాధుడు. మిధున లగ్నమునకు రవి 3, 6, 10, 11 స్థానములందుండెనేని శత్రుజయము, ధైర్యము, కార్యజయము, రాజ్యలాభము, సర్వ లాభములు కలుగును; ఆకస్మిక ధనయోగము కలుగజేయును. 1, 5, 7, స్థానముల యందుండెనేని భ్రష్టత్వము, వజ్రదూషితము, అగ్నిభయము కలుగజేయును. 8, 12, స్థానముల యందుండెనేని ప్రాణభీతి, సకల నష్టములు కలుగును. 2, 4, 9, స్థానముల యందుండెనేని మధ్యమ ఫలములు కలుగును.

హస్త నక్షత్రమునకు చంద్రుడు దశానాధుడు. ఈ చంద్రుడు మిధున లగ్నమునకు 4వ స్థానమున నుండును. విశేష ధనసౌఖ్యము, లాభములు కలుగజేయును.

మృగశిర నక్షత్ర 1, 2 పాదములకు ద్వాదశ స్థిత చంద్రదోషము గలదు. ధనిష్ఠ నక్షత్ర 1, 2 పాదములకు అష్టమస్థిత చంద్రదోషము కలదు. ఈ పాదములు పనిచేయక సర్వనాశనము గలుగజేయును. మృగశిర 3, 4 పాదములు, చిత్తనక్షత్రము, ధనిష్ఠా నక్షత్ర 3, 4 పాదములకు కుజుడు దశానాధుడు. మిధున లగ్నమునకు కుజుడు 3, 6, 9, 10, 11 స్థానములయందుండెనేని సిద్ధి, జయము, భాగ్యము, రాజ్యలాభము, ఆకస్మిక

ధనయోగము గలుగజేయును. 2, 4, 5 స్థానముల యందుండెనేని మిశ్రమ, మధ్యమ ఫలములు గలుగజేయును. 1, 7, 8, 12 స్థానములయందుండెనేని అగ్నిభయము, కళత్రభంగము, రోగము, ధనక్షయము గలుగజేయును.

స్వాతి, శతభిష నక్షత్రములకు రాహువు ధశానాధుడు. మిధున లగ్నమునకు రాహువు 3, 6, 11 స్థానముల యందుండెనేని ఆకస్మిక లాభము, శత్రు జయము, సిద్ధి గలుగజేయును. 2, 4, 5, 10 స్థానముల యందుండెనేని మధ్యమ ఫలములు గలుగజేయును. 1, 7, 8, 9, 12 స్థానముల యందుండెనేని సునాయాస సర్వనాశనము గలుగజేయును.

పునర్వసు నక్షత్రమునకు గురుడు దశానాధుడు. మిధున లగ్నమునకు గురుడు 1, 2, 4, 5, 7, 9, 10, 11 స్థానముల యందుండెనేని గృహ, కాంత, సంతాన, కలిమి, ఉద్యోగసంపదలు, మహా సౌఖ్యములు గలుగజేయును. 3, 6, 8, 12 స్థానముల యందుండెనేని విపత్తు, శత్రుదోషము, రోగము, ధనక్షయము గలుగజేయును.

రేవతి నక్షత్రమునకు బుధుడు దశానాధుడు. మిధున లగ్నమునకు బుధుడు 1, 2, 3, 5, 7, 9, 10, 11 స్థానముల యందుండెనేని సర్వసౌఖ్యములు, సౌభాగ్యము, ధనసంపద, కార్యదీక్ష, జయము గలుగజేయును. 4, 6, 8, 12 స్థానముల యందుండెనేని అరిష్టము, రోగము, సర్వకాలములయందు కష్ట నష్టములు గలుగజేయును.

## కర్కాటక లగ్నము

కర్కాటక లగ్నమునందు గృహారంభ, గృహప్రవేశములకు ముహూర్తము నిర్ణయించినప్పుడు నక్షత్ర గ్రహ దశాఫలములు క్రింది విధముగా చూడవలెను. అశ్విని, మఘ, మూల నక్షత్రములలో మూల నక్షత్రము గృహప్రవేశమునకు పనిచేయదు. షష్టస్థిత చంద్రదోషము గలదు.

ఈ నక్షత్రములకు కేతువు దశానాధుడు. కర్కాటక లగ్నమునకు కేతువు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని మంచి యోగము, మంచి కార్యము చేయుట, ధనము, జ్ఞానము, సౌఖ్యము గలుగజేయును. 5, 9 స్థానముల యందుండెనేని సామాన్యమైన ఫలములు గలుగజేయును. 1, 2, 4, 7, 8, 12 స్థానముల యందుండెనేని సకల కష్టనష్టములు, చెడ్డగుణము గలుగజేయును.

ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్రములలో ఉత్తరాషాఢ ప్రధమ పాదమునకు షష్టస్థిత చంద్రదోషము గలదు. కనుక గృహప్రవేశమునకు పనిచేయదు. ఈ నక్షత్రములకు రవి దశానాధుడు కర్కాటక లగ్నమునకు రవి 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని

ఆత్మశక్తి, శత్రుజయము, సర్వకార్యసిద్ధి, ధనరాజ్య లాభములు గలుగజేయును. 2, 4, 9 స్థానముల యందుండెనేని ధనయోగము, సామాన్యయోగము గలుగజేయును. 1, 5, 7, 8, 12 స్థానముల యందుండెనేని అగ్నిభయము, రోగము, ధననష్టము, సర్వ నష్టము గలుగజేయును.

రోహిణి, హస్త, శ్రవణ నక్షత్రములకు చంద్రుడు దశానాధుడు. కర్కాటక లగ్నమునకు చంద్రుడు 3, 7, 11 స్థానముల యందుండెనేని సర్వజయము, సర్వలాభము, సర్వ కార్యసిద్ధి సునాయాసముగా లభింపజేయును.

మృగశిర నక్షత్ర 3, 4 పాదములకు ద్వాదశ స్థిత చంద్రదోషము, ధనిష్ట 3, 4 పాదములకు అష్టస్థిత చంద్రదోషము గలదు. పై నక్షత్రములకు కుజుడు దశానాధుడు. కర్కాటక లగ్నమునకు కుజుడు 2, 3, 4, 5, 6, 9, 10, 11 స్థానముల యందుండెనేని గృహ, కాంత, సంతాన, కలిమి, ఉద్యోగ సంపదలు గలుగజేయును. 1, 7, 8, 12 స్థానముల యందుండెనేని అగ్నిభయము, రాజ్యపీడ, నష్టము, ఆపద, సకల నష్టములు గలుగజేయును.

స్వాతి నక్షత్రమునకు రాహువు దశానాధుడు. కర్కాటక లగ్నమునకు రాహువు 3, 6, 11 స్థానముల యందుండెనేని సకల సంపదలు, సర్వలాభములు, ఆకస్మిక లాభములు గలుగజేయును. 2, 4, 5, 10 స్థానముల యందుండెనేని సామాన్యముగా యోగించును. 1, 7, 8, 12 స్థానముల యందుండెనేని నాశనము. ధనక్షయము, గృహచ్ఛిద్రము గలుగజేయును.

రేవతి నక్షత్రమునకు బుధుడు దశానాధుడు. ఈ బుధుడు కర్కాటక లగ్నమునకు 1, 4, 6, 8, 9, 12 స్థానముల యందుండెనేని ఆత్మనాశనము, అరిష్టము. 2, 3, 5, 7, 10, 11 స్థానముల యందుండెనేని సర్వసంపదలు, వ్యాపార లాభములు, ధన సౌఖ్యములు గలుగజేయును.

## సింహలగ్నము

సింహ లగ్నము నందు శంఖుస్థాపన, గృహప్రవేశ ముహూర్తములు నిర్ణయించి నప్పుడు నక్షత్రగ్రహ దశాఫలములు క్రింది విధముగా జూడవలెను.

అశ్వని, మఘ, మూల నక్షత్రమునకు కేతువు దశానాధుడు. సింహలగ్నమునకు ఈ కేతువు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని ధనలాభము, శత్రునాశనము, రాచకార్య లాభము, సర్వలాభము, సౌఖ్యములు గలుగజేయును. 5, 9 స్థానముల యందుండెనేని మధ్యమ ఫలములు గలుగజేయును. 1, 2, 4, 7, 8, 12 స్థానముల యందుండెనేని ఆపద, తృణగృహము, రాజ్యనష్టము, ప్రాణభీతి, సర్వనష్టములు గలుగజేయును.

ఉత్తర నక్షత్రమునకు రవి దశానాధుడు. సింహలగ్నమునకు రవి 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని ధైర్యము, శత్రుజయము, రాచకార్యలాభము, ఆకస్మిక ధనయోగము గలుగజేయును. 2, 4, 9 స్థానముల యందుండెనేని సామాన్య లాభములు గలుగజేయును. 1, 5, 7, 8, 12 స్థానముల యందుండెనేని అగ్నిభయము, పుత్రరోగము, రాజ్య నష్టము, ఆపద, సర్వనష్టములు కలుగచేయును.

మృగశిర, చిత్త నక్షత్రములకు కుజుడు దశానాధుడు. ఈ కుజుడు సింహలగ్నమునకు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని ఇష్టసిద్ధి, ధనప్రాప్తి, ధాన్యలాభము, రాచకార్య జయము, సర్వ లాభములు గలుగచేయును. 4, 5, 9 స్థానముల యందుండెనేని మధ్యమ ఫలములు గలుగచేయును. 1, 2, 7, 8, 12 స్థానముల యందుండెనేని అగ్ని భయము, ధనక్షయము, రాచకార్య నష్టము, సర్వ నష్టములు గలుగచేయును.

స్వాతి, శతభిష నక్షత్రములకు రాహువు దశానాధుడు. సింహ లగ్నమునకు రాహువు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని ఇష్టసిద్ధి, కార్య జయము, సర్వసౌఖ్య లాభములు గలుగచేయును. 2, 5, 4 స్థానముల యందుండెనేని సామాన్య లాభములు కలుగచేయును. 1, 7, 8, 9, 12 స్థానముల యందుండెనేని సర్వనష్టములు, సకల నాశనములు కలుగచేయును.

అనురాధ నక్షత్రమునకు శని దశానాధుడు. సింహ లగ్నమునకు శని 3, 6, 11 స్థానముల యందుండెనేని సర్వ కార్యసిద్ధి, రాజ్యలాభము, ఆకస్మిక ధన లాభము గలుగచేయును. 1, 2, 4, 7, 8, 12 స్థానముల యందుండెనేని సర్వనష్టములు, సుఖ సంపదల నాశనము గలుగచేయును. 5, 9. 10 స్థానముల యందుండెనేని మధ్యమ ఫలములు గలుగచేయును.

## కన్యాలగ్నము

కన్యాలగ్నమునందు శంఖుస్థాపన, గృహ ప్రవేశములకు ముహూర్తములు నిర్ణయము చేయునప్పుడు నక్షత్ర గ్రహ దశాఫలములు ఈ క్రింది విధముగా జూడవలెను.

మూల నక్షత్రమునకు కేతువు దశానాధుడు. కన్యా లగ్నమునకు కేతువు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని ధైర్యము, శత్రుజయము, శుభకర్మలు, విశేష ధనప్రాప్తి గలుగచేయును. 1, 2, 4. 7, 8, 12 స్థానముల యందుండెనేని ఆపద, గృహచ్ఛిద్రము. రాజ్య, వ్యాపార నష్టము, సకల నష్టములు కలుగచేయును

రోహిణి, హస్త, శ్రవణ నక్షత్రములకు చంద్రుడు దశానాధుడు. కన్యా లగ్నమునకు చంద్రుడు 1, 5, 9 స్థానముల యందుండును. ధన ధాన్య వృద్ధి, గృహ భూ లాభము, పుత్రసౌఖ్యము గలుగచేయును.

స్వాతి, శతభిష నక్షత్రములలో శతభిష నక్షత్రము గృహప్రవేశమునకు షష్టస్థిత చంద్రదోషము కలదు. ఈ నక్షత్రములకు రాహువు దశానాధుడు. కన్యా లగ్నమునకు రాహువు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని సర్వ కార్యసిద్ధి శత్రువుల వల్ల లాభము, రాచకార్యము లాభము, విశేష ధనప్రాప్తి గలుగచేయును. 1, 4, 7, 8, 12 స్థానముల యందుండెనేని సర్వ శూన్యము. భాగ్య హీనత, కళత్రపీడ, భ్రష్టత్వము గలుగచేయును. 2, 5, 9 స్థానముల యందుండెనేని మధ్యమ ఫలములు కలుగచేయును.

పునర్వసు నక్షత్రమునకు గురుడు దశానాధుడు. కన్యాలగ్నమునకు గురుడు 1, 2, 4, 5, 7, 9, 10, 11 స్థానముల యందుండెనేని గృహ, కాంత, సంతాన, కలిమి, ఉద్యోగ సంపదలు గలుగచేయును. 3, 6, 8, 12 స్థానముల యందుండెనేని త్రిప్పట, ఆపద, కలహము, ధన భయములు గలుగచేయును.

పుష్యమి, అనురాధ, ఉత్తరాభాద్ర నక్షత్రములకు శని దశానాధుడు. ఈ శని కన్యా లగ్నమునకు 3, 6, 11 స్థానముల యందుండెనేని కార్య జయము, శత్రుజయము, ద్రవ్యప్రాప్తి, గలుగచేయును. 5, 9, 10 స్థానముల యందుండెనేని సామాన్య ఫలములు గలుగచేయును. 1, 2, 4, 7, 8, 12 స్థానముల యందుండెనేని స్థానభ్రష్టము, ధననష్టము, గృహభ్రష్టము, రాజ్యనష్టము, ప్రాణభయము మొదలగు ఫలములు గలుగచేయును.

రేవతి నక్షత్రమునకు బుధుడు దశానాధుడు. ఈ బుధుడు కన్యాలగ్నమునకు 1, 2, 3, 5, 7, 9, 10, 11 స్థానముల యందుండెనేని, గృహ, కాంత, సంతాన కలిమి, ఉద్యోగ సంపదలు, సర్వ సౌఖ్య లాభములు కలుగచేయును. 4, 6, 8, 12 స్థానముల యందుండెనేని ఆపద, శత్రుబాధ, ఆత్మనాశనము, సకల నష్టములు కలుగచేయును.

## తులా లగ్నము

తులా లగ్నమున గృహారంభ, గృహప్రవేశములకు ముహూర్త నిర్ణయము చేయునప్పుడు నక్షత్ర గ్రహ దశా ఫలములు క్రింది విధముగా చూడవలెను.

అశ్వని, మఘ, మూల నక్షత్రములకు కేతువు దశానాధుడు. తులా లగ్నమునకు కేతువు 6, 3, 10, 11 స్థానముల యందుండెనేని కార్యసిద్ధి, శత్రుజయము, ధన లాభము, రాచకార్య సిద్ధి, సకల సౌఖ్యములు కలుగచేయును. 5, 9 స్థానముల యందుండెనేని సామాన్య ఫలములు కలుగచేయును. 1, 2, 4, 7, 8, 12 స్థానముల యందుండెనేని సకల ఐశ్వర్యములు నశింపచేసి, వైరాగ్యము కలుగచేయును.

ఉత్తరాషాఢ నక్షత్రమునకు రవి దశానాధుడు. ఈ రవి తులాలగ్నమునకు 3, 6, 9, 10 11 స్థానముల యందుండెనేని ఆశ్చర్యమైన ధనలాభము, జయము, ధైర్యము,

రాజ్యలాభము కలుగచేయును. 1, 2, 4, 5, 7, 8, 12 స్థానముల యందుండెనేని అగ్ని ప్రమాదము, భయము, సుఖనష్టము, ఆపద, ఆత్మనష్టము మొదలగు దుష్ఫలములు కలుగచేయును.

శ్రవణ నక్షత్రమునకు చంద్రుడు దశానాధుడు. ఈ చంద్రుడు తులా లగ్నమునకు 4వ స్థానమున ఉండును. సర్వ కార్యసిద్ధి, సకల శుభములు కలుగచేయును.

మృగశిర నక్షత్ర 1, 2 పాదములు; చిత్త 1, 2 పాదములకు అష్టమద్వాదశ స్థిత చంద్రదోషము గాన పనిచేయవు. మృగశిర నక్షత్రము 3, 4 పాదములకు, చిత్త నక్షత్ర 3, 4 పాదములకు, ధనిష్ట నక్షత్రమునకు కుజుడు దశానాధుడు ఈ కుజుడు తులాలగ్నమునకు 2, 3, 4, 5, 6, 9, 10, 11 స్థానములయందుండెనేని ధన, సోదర, క్షేత్ర, పుత్రసౌఖ్యములు, శత్రునాశనము, భాగ్యవృద్ధి, రాజ్యలాభము, సర్వసౌఖ్యములు కలుగును. 1, 7, 8, 12 స్థానముల యందుండెనేని అగ్ని ప్రమాదము, రాజ్యనష్టము, ప్రాణభీతి, ధననష్ట భయములు కలుగచేయును.

స్వాతి , శతభిష నక్షత్రములకు రాహువు దశానాధుడు. ఈ రాహువు తులా లగ్నమునకు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని సర్వకార్యజయము, శత్రుజయము, విశేష ధనలాభము కలుగచేయును. 2, 4, 5 స్థానముల యందుండెనేని మిశ్రమ ఫలము కలుగచేయును. 1, 7, 8, 12 స్థానముల యందుండెనేని స్థానభ్రష్టము, ఆపద, భాగ్యహీనత, వ్యయము కలుగచేయును.

పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర నక్షత్రములలో ఉత్తరాభాద్ర నక్షత్రము మాత్రము గృహప్రవేశమునకు షష్టస్థిత చంద్రదోషము కలదు. ఈ మూడు నక్షత్రములకు శని దశానాధుడు. ఈ శని తులాలగ్నమునకు 3, 6, 11 స్థానముల యందుండెనేని సకలైశ్వర్యములు. సర్వకార్యసిద్ధి కలుగచేయును. 5, 9 స్థానముల యందుండెనేని మిశ్రమ ఫలములు కలుగచేయును. 1, 2, 4, 7, 8, 12 స్థానముల యందుండెనేని నానా విధములైన కష్ట నష్టములపాలు చేయును, దుఃఖములు కలుగును.

రేవతి నక్షత్రమున గృహప్రవేశమునకు షష్టస్థిత చంద్రదోషము గలదు. ఈ నక్షత్రమునకు బుధుడు దశానాధుడు. ఈ బుధునకు తులాలగ్నమున వ్యయాధిపత్యము కలదు. కాన శుభము ఇవ్వజాలడు.

## వృశ్చిక లగ్నము

వృశ్చిక లగ్నము శుభముహూర్తములకు పనిచేయదని కాలామృత అభిప్రాయము. కాని షడ్వర్గులు వచ్చి నక్షత్ర దశానాదులు శుభయోగము గలవారైనప్పుడు- అనగా గ్రహబలము ఉన్నప్పుడు ముహూర్తములు పెట్టుకొనవలెను. ఈ వృశ్చిక లగ్నమున శంఖుస్థాపన, గృహప్రవేశ ముహూర్తములు నిర్ణయించినప్పుడు నక్షత్ర గ్రహ దశాఫలములు క్రింది విధముగా చూచుకొనవలెను.

అశ్వని నక్షత్రమున గృహప్రవేశమునకు షష్టస్థిత చంద్రదోషము కలదు. మఘ, మూల ఈ మూడు నక్షత్రములకు కేతువు దశానాధుడు. ఈ కేతువు వృశ్చిక లగ్నమునకు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని కార్యసిద్ధి, జయము, రాజ్యసౌఖ్యము, విశేష ధనలాభము కలుగచేయును. 1, 2, 4, 5, 7, 8, 9, 12 స్థానములయందుండెనేని ఏ మాత్రము పనిచేయవు. నానావిధ దుఃఖములపాలు చేయును.

ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్రములకు రవి దశానాధుడు. ఈ రవి వృశ్చిక లగ్నమునకు 3, 6, 11 స్థానముల యందుండెనేని ధైర్య సాహసములు శత్రుజయము, విశేషమైన ధనలాభములు గలుగును. మిగిలిన తొమ్మిది స్థానములు చాలా అనర్ధకము గలుగజేయును.

రోహిణి, హస్త, శ్రవణ నక్షత్రములకు చంద్రుడు దశానాధుడు. ఈ చంద్రుడు 3, 7, 11 స్థానములయందుండును. స్త్రీ ధనప్రాప్తి, ఆకస్మిక ధనలాభం, శత్రుజయము గలుగజేయును

చిత్త 1, 2 పాదములు, ధనిష్ట నక్షత్రములకు కుజుడు దశానాధుడు. ఈ కుజుడు వృశ్చిక లగ్నమునకు 6, 8, 11 స్థానముల యందుండెనేని భూ లాభము, రాజ్యలాభము, సర్వలాభములు గలుగజేయును. 1, 2, 4, 5, 7, 8, 9, 10, 12 స్థానముల యందుండెనేని సర్వకాలములయందు ఆపద, ధన, క్షేత్రనష్టము గలుగజేయును.

శతభిష నక్షత్రమునకు రాహువు దశానాధుడు. ఈ రాహువు వృశ్చిక లగ్నమునకు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని ధనలాభము, కార్యసిద్ధి, రాజ్యలాభము, అనుకూలమైన వ్యవహార లాభములు కలుగజేయును. 2, 4, 5 స్థానముల యందుండెనేని మధ్యమ ఫలములు కలుగజేయును. 1, 7, 8, 12 స్థానముల యందుండెనేని నానావిధ నష్టములు కలుగజేయును.

పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర నక్షత్రములకు శని దశానాధుడు. ఈ శని వృశ్చిక లగ్నమునకు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని కార్యసిద్ధి, ధైర్యము, శత్రుజయము, అనేక విధములైన ధనలాభము గలుగచేయును. 5, 9 స్థానముల యందుండెనేని మధ్యమ ఫలములు గలుగజేయును. 1, 2, 4, 7, 8, 12 స్థానముల యందుండెనేని అపమృత్యు దోషము, ధనక్షయము, మానహాని, కళత్రమునకు అనారోగ్యము, సర్వశూన్యము గలుగును.

## ధనుర్లగ్నము

ధనుర్లగ్నమున శంఖుస్థాపన, గృహప్రవేశములకు ముహూర్తములు నిశ్చ యించినప్పుడు నక్షత్రగ్రహ దశాఫలములు క్రింది విధముగా చూడవలెను.

అశ్వని, మఘ, మూల నక్షత్రములకు కేతువు దశానాధుడు. ఈ కేతువు ధనుర్లగ్న మునకు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని రాజ్యలాభము, శత్రుజయము,

భాగ్యవృద్ధి, సర్వకార్య జయము కలుగజేయును. 1, 2, 4, 5, 7, 8, 12 స్థానముల యందుండెనేని గృహచ్ఛిద్రము, ధనక్షయము, క్షేత్రనష్టము, పుత్రరోగం, అనారోగ్యము మొదలగు దుష్టఫలములు గలుగును.

ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్రములకు రవి దశానాధుడు. ఈ రవి ధనుర్లగ్నమునకు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని ధనవృద్ధి, శత్రునాశనము, రాజ్యలాభము, విశేష ధనసౌఖ్యము కలుగజేయును. 2, 5, 6 స్థానముల యందుండెనేని మధ్యమ ఫలములు కలుగజేయును. 1, 7, 8, 12 స్థానముల యందుండెనేని అగ్నిభయము, కళత్రరోగము, భాగ్యహీనత, సర్వనష్టములు కలుగజేయును.

స్వాతి, శతభిష నక్షత్రములకు రాహువు దశానాధుడు. ఈ రాహువు ధనుర్లగ్నమునకు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని కార్యసిద్ధి, శత్రుజయము, రాజ్యలాభము, విశేష ధనసౌఖ్యములు కలుగజేయును. 2, 5 స్థానముల యందుండెనేని మధ్యమ ఫలము కలుగజేయును. 1, 4, 7, 8, 12 స్థానముల యందుండెనేని భాగ్యక్షేత్ర నష్టము, కళత్రపీడ, ఆత్మనాశనము కలుగజేయును.

ఉత్తరాభాద్ర నక్షత్రమునకు శని దశానాధుడు. ఈ శని ధనుర్లగ్నమునకు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని ధైర్యము, శత్రుజయము, రాజ్య కార్యలాభము, విశేష ధనప్రాప్తి కలుగజేయును. 1, 2, 4, 7, 8, 12 స్థానముల యందుండెనేని దేశభ్రష్టము, గృహచ్ఛిద్రము, క్షేత్రనాశనము, కళత్రరోగము, సర్వనాశనము కలుగజేయును. 5, 9 స్థానముల యందుండెనేని మధ్యమ ఫలములు కలుగజేయును.

రేవతి నక్షత్రమునకు బుధుడు దశానాధుడు. ఈ బుధుడు ధనుర్లగ్నమునకు 1, 2, 3, 5, 7, 9, 10, 11 స్థానముల యందుండెనేని క్షేత్రలాభము, ధనవృద్ధి, పుత్రలాభము, కళత్రసౌఖ్యము, భాగ్య, రాజ్య సకల లాభములు కలుగజేయును. 4, 6, 8, 12 స్థానముల యందుండెనేని ఆపద, శత్రుభయము, నష్టము, స్థానభ్రష్టత్వము కలుగజేయును.

## మకరలగ్నము

మకర లగ్నమున శంఖుస్థాపన, గృహప్రవేశ ముహూర్తములు నిశ్చయించి నప్పుడు నక్షత్ర గ్రహ దశాఫలాలు ఈ క్రింది విధముగా చూడవలెను.

అశ్వని నక్షత్రమునకు కేతువు దశానాధుడు. ఈ కేతువు మకరలగ్నమునకు 3, 6, 10, 11 స్థానముల యందుండెనేని ఆత్మశక్తి, శత్రువుల వలన ధనలాభము, భాగ్య రాజ్య విశేష ధనలాభము కలుగజేయును. 1, 2, 4, 5, 7, 8, 12 స్థానముల యందుండెనేని పద భ్రష్టత్వము, ధన నష్టము. క్షేత్ర నాశనము, పుత్రరోగము, రాజావమానము, సకల నష్టములు కలుగజేయును.

